అత్యంత
అధునాతనమైన




వస్త్రాలకై
సందర్శించండి

PHONE : 76545

ప్రత్యేక షో రూం

# జూలూరి వీరేశలింగం

ఎంటర్ ప్రైజెస్
జనరల్ బజార్ సికింద్రాబాద్




# CONTEST



WIN any one of the 5 (Five) Cheques already drawn and kept in sealed covers in the custody of Canara Bank, Bangalore, by guessing the Cheque amount correctly. Fill *in the Coupon below and mail* your entry to the NATIONAL PRODUCTS, 135, Kaval Byrasandra, Bangalore-560006.

If there are no correct entries the nearest guess wins the prize. If there are more than one successful entries the Cheque amount will be shared amongst them.

You can send any number of entries as you desire but every entry form must be accompanied by 10 (ten) empty wrappers of NP Crackies Strip pack.

Entries close on May 31, 1974 and the result will be published in The July Issue of Chandamama.

**NO CORRESPONDENCE WILL BE ENTERTAINED AND THE DECISION OF THE NP MANAGEMENT IS FINAL.**

NP-MAC(B)

CUT HERE

NO ENTRY FEE

Fill in ink legibly

*Corrections and* overwritings disqualify the entries.

Contest strictly governed by the *rules and regulations* laid down.

**NP CRACKIES CONTEST ENTRY FORM • LAST DATE 31-5-1974**

| Prizes | Cheque Numbers | Amount of the *cheque is* between | FILL IN Your guess of the cheque amount Rs. | P |
|---|---|---|---|---|
| I | 508183 | Rs. 1501 and 2000 | | Nil |
| II | 508184 | 1001 and 1500 | | Nil |
| III | 508185 | 751 and 1000 | | Nil |
| IV | 508186 | 501 and 750 | | Nil |
| V | 508187 | 251 and 500 | | Nil |

*Name* ______________________ *Age* ______

Address: ______________________

______________________

Date ____________ Signature of the contestant ____________

# పెరిగే వయస్సుకు ప్రియ మిత్రము-ఇన్‌క్రిమిన్*!




ఉప్పొంగే జీవితం. పిల్లలలో శక్తి సంపూర్ణమైన ఆరోగ్యం! పెరిగే వయస్సులో మీ పిల్లలకు ఇన్‌క్రిమిన్ టానిక్ ఇవ్వండి. ఇన్‌క్రిమిన్ సిరప్‌లో ఉపయోగకరమైన విటమిన్లు, ఐరన్ మరియు అవసరమైన అమినో ఏసిడ్-పెరిగే వయస్సులో ముఖ్యమైనవి అన్నీ వున్నాయి.

## ఇన్‌క్రిమిన్*

**ఇన్‌క్రిమిన్ టానిక్–పెరిగే పిల్లలకు వరప్రసాదం!**

డాక్టర్లు విశ్వసించే పేరు Lederle ఎ డివిజన్ ఆఫ్ సయానమిడ్ ఇండియా లిమిటెడ్

* అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు

SISTAS-INC-3068A TEL



# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [ "శ్రమ ఫలితం" ] భైరి సత్యనారాయణ రచన. సాధారణంగా మనం "దేశ భక్తి", "దేశద్రోహం" లాటి మాటలను ఉపయోగిస్తాం. రాజులు పాలించిన కాలంలో రాజభక్తి, రాజద్రోహం అనేవి కూడా అమలులో ఉండేవి. ఇవి అర్థం లేని మాటలు. రాజు పాపాత్ముడైతే రాజద్రోహి దేశభక్తుడు కావచ్చు. దేశద్రోహి రాజభక్తుడు కావచ్చు. "అర్థం లేని మాటలు" అన్న కథ దీన్ని స్పష్టం చేస్తున్నది.

సంపుటి 54 మే '74 సంచిక 5

CP

CHITRA



# అమరవాణి

విద్యా వివాదాయ, ధనం మదాయ
శక్తిః పరేషాం పరిపీడనాయ
ఖలస్య; సాధో ర్విపరీత మేతత్,
జ్ఞానాయ, దానాయ చ, రక్షణాయ. 1

[దుర్మార్గులకు చదువు పోట్లాడటానికీ, డబ్బు పొగరుబోతు దనానికీ, శక్తి ఇతరులను హింసించటానికీ ఉపయోగపడుతుంది. దీనికి వ్యతిరేకంగా మంచివాళ్ళకు తెలివితేటలకు (చదువు), ఈవికి (డబ్బు), ఇతరులను రక్షించటానికి (శక్తి) ఉపయోగ పడతాయి.]

సముద్ర మంథనే లేభే
హరి ర్లక్ష్మీం, హరో విషం;
భాగ్యం ఫలతి సర్వత్ర,
న విద్యా, న చ పౌరుషం. 2

[సముద్ర మథన మప్పుడు విష్ణువుకు లక్ష్మి, శివుడికి విషమూ లభించాయి. ఫలం భాగ్యాన్నిబట్టి ఉంటుందిగాని, విద్యను బట్టి, పౌరుషాన్ని బట్టీ ఉండదు.]

గుణవంతః క్లిశ్యంతే ప్రాయేణ,
భవంతి నిర్గుణాః సుఖినః;
బంధన మాయాంతి శుకాః,
యథేష్ట సంచారిణః కాకాః. 3

[గుణవంతులు తరచుగా కష్టపడతారు, గుణహీనులు సుఖపడతారు. చిలుకలు బంధాలలో చిక్కుకుంటాయి, కాకులు స్వేచ్ఛగా తిరుగుతాయి.]

వ్యత్యాసాలు



# యక్షపర్వతం

## 24

[వీరపుర రాజకుమార్తె వసంతకుమారిని యక్షుడి నుంచి కాపాడి తెస్తామని, వీరపుర మంత్రికి అభయం యిచ్చి, ఖడ్గ జీవదత్తులు యక్ష మణిభూషణుడు తెచ్చిన పడవ ఎక్కి బయలు దేరారు. సూర్యాస్తమయ సమయంలో వాళ్ళు నది పక్కన వున్న ఒక కొండ దరి చేరారు. జీవదత్తుడు ఆజ్ఞాపించగా మణిభూషణుడు పడవను ఒడ్డు కేసి నడిపాడు. తరవాత—]

పడవ ఒడ్డు చేర గానే ఖడ్గ జీవదత్తులు పడవలోంచి నేల మీదికి దూకారు. జీవదత్తుడు, మణిభూషణుడితో, "పడవను ఒడ్డునున్న ఏ రాయికైనా కట్టివెయ్యి. పడవలో వున్న పళ్ళూ ఫలాలూ కావాలంటే నువ్వే తిను. నేను, కీకారణ్యంగా వున్న యీ చుట్టు పక్కల ఏదైనా లేడి గాని, అడవిపందిగాని, కనబడుతుందేమో చూసి వేటాడితెస్తాను," అన్నాడు.

యక్షమణిభూషణుడు ఆ మాటలకు భయపడిన వాడిలా ముఖం పెట్టి, "జీవదత్తా, యీ కొండల్లోకి పోకు. ఈ ప్రాంతం భయంకరులైన రాక్షసులకు ఆవాసం," అన్నాడు.

"రాక్షసుల కన్నా కూడా భయంకరులూ, మంత్ర తంత్ర వేత్తలూ అయిన మీ యక్షుల మధ్యకు పోనున్న నేను, ఈ రాక్షసుల కెందుకు భయపడాలి?"



అని జీవదత్తుడు ఖడ్గవర్మకు, "ఖడ్గా, నేను పావుగంట లోపలే తిరిగొస్తాను. నువ్వు చితుకులు పేర్చి నిప్పు రాజెయ్యి." అని చెప్పాడు.

జీవదత్తుడు అన్నట్టె ఒక్క పావు గంట గడిచీ గడవక ముందే లేడి నొకదాన్ని వేటాడి, భుజాన వేసుకుని పడవ దగ్గిరకు తిరిగొచ్చాడు. ఆ సరికి ఖడ్గవర్మ ఎండు కట్టెలు పోగుచేసి మంట చేశాడు.

క్షణాలమీద ఖడ్గ జీవదత్తులు లేడిని కోసి దాని మాంసాన్ని నిప్పుల మీద కాల్చ సాగారు. మాంసం కాలుతున్న వాసన ఆ చుట్టు పక్కల వ్యాపించింది.

ఆ సమయంలో భయంకరాకారంలో వున్న ఒక రాకసి చెట్లలో నుంచి చేతులు చాచి ముందుకొస్తూ, "నరవాసన! నరవాసన!" అంటూ అరిచింది.

రాకసిని చూస్తూనే ఖడ్గవర్మ లేచి నిలబడి కత్తిదూసి, దానికేసి వెళ్ళబోయాడు. జీవదత్తుడు అతణ్ణి ఆపి, రాకసితో, "నువ్వు రాకసివేనా లేక రాకసి రూపం ధరించిన యక్షుడివా? ఇక్కడ నరవాసనతో పాటు, బాగా పక్వమైన లేడిమాంసం వాసన కూడా వస్తున్నది గదా. ఆ వాసన నీ ముక్కు రంధ్రాలకు తగలటం లేదా ఏం?" అని అడిగాడు.

రాకసి ఆ మాటలకు ఆశ్చర్యపోతూ, "ఎవడ్రా నువ్వు? మనిషివై వుండి నన్ను చూడగానే బెదిరి గుండెలవిసి చావక, నన్నే ఎదురు ప్రశ్నిస్తున్నావా?" అన్నది.

రాకసి యిలా అనగానే ఖడ్గవర్మ ఒక్క ఎగురున పోయి దాని జుట్టు పట్టుకున్నాడు. అతడు దాన్ని కత్తితో పొడవబోయేంతలో జీవదత్తుడు, అతడి చేయి పట్టుకుని, తన మంత్రదండాన్ని రాకసి తలకు అనిస్తూ, "రాకసీ! ఇప్పుడు చెప్పు, మేం మామూలు మనుషులమా లేక....." అంటూ ఆగాడు.

రాకసి నిలువెల్లా వణికిపోతూ, "మీరు మనుషులు కాదు, యక్షులై వుంటారు. నన్ను వదలండి. నా ఇద్దరు కొడుకుల్నీ మీరు లోగడే పట్టుకుని యక్షపర్వతానికి తీసుకు పోయారు గదా. నేను వయసు మళ్ళినదాన్ని; ఆ కొండ పొట్టలో రాళ్ళూ రప్పలూ కొట్టి, మీ కోసం బంగారం, మణులూ బయటికి తీయలేను," అన్నది.

ఆ జవాబు ఖడ్గ జీవదత్తుల్ని చాలా ఆశ్చర్యపరిచింది.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు కత్తిని ఒరలో పెట్టమని చెప్పి, ''రాకసీ, నిన్ను చంపటం మా ఉద్దేశం కాదు. నీ కొడుకులిద్దర్నీ యక్షులు పట్టుకు పోయారంటున్నావే, ఆ మాట నిజమైతే వాళ్ళను కూడా కాపాడి తెస్తాను. అదుగో, అక్కడ కూర్చున్న వాడు యక్షుడే! కనక, వాళ్ళను గురించిన రహస్యాలు యిక్కడ చెప్పవద్దు. నీ నివాసం ఎక్కడ? అక్కడికి పోదాం పద,'' అన్నాడు.

ఈ సారి రాకసి, యక్షమణిభూషణుడి కేసి చూసి గుడ్లు తేలవేస్తూ, ''అయ్యా, నరుడా! నన్ను దయవుంచి ఆ యక్షుడికి ఒప్పు చెప్పకు. నా దారిన నన్ను పోనీ,'' అన్నది.

జీవదత్తుడు, రాకసికి అభయం యిస్తూ, ''నేనూ, నా మిత్రుడూ



యీ దుర్మార్గులైన యక్షులు నివసించే యక్షపర్వతానికే పోతున్నాం. వాళ్ళను గురించిన సమాచారం నీకు కొంత తెలిసి నట్టున్నది. నీ గుహకు పద, చెపుదువు గాని,'' అన్నాడు.

యక్షుణ్ణి చూసినప్పటి నుంచీ రాకసికి అక్కణ్ణించి ఎంత త్వరగా పారిపోదామా అని వున్నది. జీవదత్తుడు గుహ పేరు తేగానే అది, అతడికి నమస్కరిస్తూ, ''అయ్యా, నరుడా! నువ్వు మా గుహ దగ్గిరకురా, దాపులనే వున్నది. నా భర్త అక్కడే వున్నాడు. అతను మీకు యక్ష పర్వతాన్ని గురించిన ఎన్నో భయంకర విషయాలు చెపుతాడు,'' అన్నది.



జీవదత్తుడు, రాకసితో సరే పదమని చెప్పి, ఖడ్గవర్మతో, "ఖడ్గా, నేను తిరిగి వచ్చే వరకూ నీ కత్తికి, నా మంత్రదండం మహిమ వుంటుంది. మణిభూషణుడు పారిపోవాలని చూసినా లేక ఏదైనా హాని తలపెట్టినా, అతణ్ణి నిర్దాక్షిణ్యంగా వధించు," అన్నాడు.

ఆ మాటలకు మణిభూషణుడు వెల వెల పోయి, అంతలోనే లేని నవ్వును తెచ్చి పెట్టుకుని, "జీవదత్తా, నువ్వా దుర్మార్గురాలి మాటలు నమ్మకు. రాక్షసులు పరమక్రూరులు. అది నిన్ను గుహకు తీసుకుపోయి నిలువునా విరుచుతిన్నా తినవచ్చు," అన్నాడు.

జీవదత్తుడు ఆ మాటలకు నవ్వి, "ఒక వేళ రాకసీ దాని మొగుడూ కలిసి నన్ను విరుచుకుతిన్నా, నీ స్నేహితుడైన మణి రంజితుణ్ణి హతంచేసి, రాతిరథాన్ని కదిలించి, రాజకుమార్తెలను బంధవిముక్తు రాళ్ళను చేసేందుకు ఖడ్గవర్మ వున్నాడు. ఆ మాట మాత్రం మరిచిపోకు మణి భూషణా," అన్నాడు.

జీవదత్తుడు యిలా అనగానే మణి భూషణుడి ముఖం కోపంతో ఎర్రనైంది. కాని, అతడు నోరు మెదిపి జవాబివ్వ టానికి భయపడి, తల వంచుకున్నాడు. ముందుండి రాకసి దారితీయగా, జీవ దత్తుడు దాని వెనగ్గా గుబురు చెట్లలోకి పోయాడు.

రాకసి యింకా భయంతో కంపించి పోతూనే జీవదత్తుణ్ణి వెంటబెట్టుకుని నాలుగైదు నిమిషాల్లో ఒక గుహ దగ్గిరకు తీసుకుపోయింది. గుహ ముందు మహా కాయుడైన రాకసుడొకడు పెద్ద కాగడా వెలిగించి, ఆ కాంతిలో ఒక బండరాయికి చేరగిలబడి కూర్చుని వున్నాడు. వాడు ముందువస్తున్న తన భార్యనూ, కొంచెం వెనగ్గా నడుస్తున్న జీవదత్తుణ్ణీ చూస్తూనే, "ఆశ్చర్యం! ఆశ్చర్యం! ఈ నరమానవు డెవడు, నిర్భయంగా నీ వెంట వస్తు న్నాడు?" అన్నాడు.

రాక్షసి ముందుగా తన భర్తను సమీపించి, "నువ్వు ఆకలికొద్దీ ఈయన్ని నమిలి మింగాలని చూసేవు, జాగ్రత్త! ఈ మనిషి చేతిలో గొప్ప మంత్రదండం వున్నది. ఈయనా, యీయన నేస్తం కలిసి ఒక యక్షుణ్ణి బంధించి తెచ్చారు," అన్నది.

"యక్షుడంతటి వాణ్ణి బందీగా పట్టుకోవటమా?" అంటూ రాక్షసుడు, జీవదత్తుడి కేసి కళ్ళింతచేసి చూస్తూ, "అయ్యా, నా పెళ్ళాం చెప్పేమాట నిజమేనా? అది కొంచెం వెర్రిబాగులది," అన్నాడు.

జీవదత్తుడు చిన్నగా నవ్వి, "నీ పెళ్లాం చెప్పిన దాంట్లో అబద్ధం ఏమీ లేదు. నీ కొడుకులిద్దరిని యక్షులు బందీలుగా పట్టుకుపోయి, ఎక్కడో యక్షపర్వతంలో వుంచారని విన్నాను. ఆ పర్వతాన్ని గురించిన రహస్యాలేమైనా వున్నవా?" అని అడిగాడు.

రాక్షసుడు తలాడిస్తూ కొంచెం సేపు నేల చూపులు చూసి, తరవాత తల ఎత్తి "అయ్యా, మీరేదో మంత్ర తంత్ర శక్తులు కలవాళ్ళై అయివుండాలి, లేకపోతే యింత ధైర్యంగా నా ముందుకు వచ్చి మాట్లాడలేరు. ఇక ఆ యక్షపర్వతం సంగతి. ఈ విశాలమైన వింధ్య పర్వత ప్రాంతాల్లో అది ఒక చిన్న పర్వతం.



ఆ పర్వత పరిసరాలకు మణిరంజితుడనే వాడు అధిపతి. వాణ్ణి యక్షరాజు చాలకాలం కిందట ఆ యక్షపర్వతానికి అధిపతిగా నియమించాడు. ఆ నాటినుంచి ఆ మణిరంజితుడు చేయని ఘోరం అంటూ ఏమీ లేదు," అన్నాడు.

జీవదత్తుడు, రాక్షసుడి కేసి సానుభూతిగా తలాడించి, "ఆ మణిరంజితుడు పరమ కిరాతకుడని నాకు తెలుసు. మా దేశంలోవున్న ఇద్దరు రాజకుమార్తెలను చెరపట్టి తెచ్చాడు. నాక్కావలసిన సమాచారం; వాడు నీబోటిరాక్షసులనూ వాళ్ళనూ పట్టుకుపోయి ఏం చేస్తూ వుంటాడని!" అన్నాడు.



"ఆ యక్షపర్వతం లోపల మణి మాణిక్యాలూ, బంగారం వున్నదట! వాటిని తవ్వి బయిటికి తీయించేందుకు ఆ మణిరంజితుడు తాను బందీలుగా పట్టుకున్న వాళ్ళను బానిసలుగా ఉపయోగిస్తూంటాడు. ఆ బానిసల్లో రాక్షసులే కాక, వాడిచేతబడిన కొందరు గంధర్వులు కూడా వున్నారని నేను విన్నాను. అలాంటి వాళ్ళందరూ రాత్రిం బవళ్ళు, తాము పనిచేస్తున్న ఆ చీకటి కొండకడుపులో కాలం వెళ్ళబుచ్చవలసిందే," అన్నాడు రాక్షసుడు.

"అంటే, ఆ బానిసలు కొండ గర్భంలో నుంచి బయిటికి వచ్చి పారిపోకుండా యీ మణిరంజితుడు తగిన కాపలా ఏదో పెట్టివుంటాడన్న మాట. సరే, అక్కడ ఏదైనా రాతిరథం లాటిది వున్నదా?" అని అడిగాడు జీవదత్తుడు.

"అయ్యా, ఉన్నది. ఆ రథాన్ని కొండలోనే మలిచినట్టు చెప్పుకుంటారు. కాని, నేనైతే దాన్ని చూడలేదు," అన్నాడు రాక్షసుడు.

జీవదత్తుడికి ఇక రాక్షసుడి నుంచి అడిగి తెలుసుకోవలసిన సమాచారం ఏమీ వున్నట్టు కనిపించలేదు. రాక్షసుడు ఆ నోటా యీ నోటా యక్షపర్వతాన్ని గురించి విన్నదేదో చెప్పటం తప్ప, అతడు ఆ పర్వతాన్ని చూసి వుండలేదని అతడికి తోచింది.

జీవదత్తుడు అక్కణ్ణుంచి ఖడ్గవర్మ, యక్ష మణిభూషణుడూ వున్నచోటుకు బయలుదేరుతూ, రాక్షసితో, "నువ్వు నరవాసన అంటూ వచ్చి నా కంటబడటం కొంత మేలే అయింది. నా వెంట వచ్చి కాల్చిన లేడిమాంసంలో నీ క్కావలసినంత ఎత్తుకుపో," అన్నాడు.

రాక్షసి ఆ మాటలకు సంతోషించిన దానిలా కనిపించి, రాక్షసుడితో మెల్లిగా ఏదో చెప్పింది. వాడు జీవదత్తుడితో, "అయ్యా, మీరు మహా శక్తివంతులన్న నమ్మకం నాక్కలిగింది. ఒక వేళ

దుర్మార్గుడైన ఆ మణిరంజితుణ్ణి మీరు గెలిచే పక్షంలో, వాడికి బానిసలుగా వున్న నా ఇద్దరు కొడుకులకూ స్వేచ్ఛ యిప్పించండి,'' అన్నాడు.

జీవదత్తుడు నడుస్తున్న వాడల్లా ఆగి, వెనక్కు తిరిగి, ''రాక్షసుడా, నీ పేరేమిటో నాకు తెలియదు.... ఆ మణిరంజితుణ్ణుంచి నీ కొడుకులకే గాదు, మరి చాలా మందికి స్వేచ్ఛ కలిగించబోతున్నాను, దిగులు పడకు,'' అన్నాడు.

''అయ్యా, నా పేరు చండముఖుడు. మరిచిపోకండి,'' అన్నాడు రాక్షసుడు.

కొద్దిసేపటి తరవాత జీవదత్తుడి వెంట రాక్షసి రావటం చూస్తూనే మణిభూషణుడు నిలువెల్లా వణికిపోతూ, ఖడ్గవర్మతో, ''ఇదేమిటి? నీ మిత్రుడు రాక్షసిని మళ్ళీ వెంటబెట్టుకు వస్తున్నాడు?" అన్నాడు.

''బహుశా, నిన్ను దానికి ఆహారంగా యిస్తానన్నాడేమో, జీవదత్తుడు. అడిగి చూద్దాం,'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఇది అన్యాయం. నేను లోగడ చెప్పానో లేదో! మణిరంజితుడు నా మిత్రుడు కాదు, యజమాని. అతడి ఆజ్ఞలు నిర్వహించటం తప్ప, నాకై నేను ఇతరులకు చేసిన హాని ఏమీ లేదు,'' అన్నాడు మణిభూషణుడు.



ఆ మాటలు వింటూనే జీవదత్తుడు కోపంగా, ''మణిభూషణా, ఇప్పటి నుంచే చావు భయంతో ఉన్న మతి కాస్తా పోగొట్టుకోకు. ఈ రాక్షసి భర్తవల్ల యక్ష పర్వతం మీది మీవాళ్ళ రహస్యాలన్నీ తెలుసుకున్నాను. ఒకవేళ నేనూ, ఖడ్గవర్మా నీ యజమాని మణిరంజితుణ్ణి జయించలేక పోవచ్చు. కాని అలా జరిగితేమాత్రం మీ యక్షులందర్నీ పట్టుకుని చిత్రహింసలకు గురిచేయటానికి యీ దాపులనే అపరరావణాసురుడి వంటి వాడి నాయకత్వాన పెద్ద రాక్షససేన సిద్ధంగా వుంది. వాళ్ళు మీ పర్వతాన్ని నేలమట్టం చేస్తారు,'' అన్నాడు.

"రాక్షససేనా?" అంటూ మణి భూషణుడు తెల్లబోయాడు.

"అవును, రాక్షససేనే! ఆ మాట బాగా గుర్తుంచుకో," అని జీవదత్తుడు, రాక్షసితో, "లేడిమాంసంలో నీక్కావలసినంత ఎత్తుకుపో. యక్షపర్వతం మీద దాడికి యింకా సమయం రాలేదని, మీ నాయకుడితో చెప్పు," అన్నాడు.

రాక్షసి అడ్డ దిడ్డంగా తలాడించి లేడి మాంసం తీసుకుని తిరిగి తన గుహకేసి వెళ్ళిపోయింది. ఆ తరవాత ఖడ్గ జీవ దత్తులూ, మణిభూషణుడూ భోజనాలు ముగించి, ఒక చెట్టు కింద, చదునుగా వున్న రాళ్ళమీద పడుకున్నారు. మణి భూషణుడు, ఖడ్గ జీవదత్తుల నుంచి కొంచెం దూరంగా పక్క వేసుకున్నాడు. అతడు పడుకునే ముందు నది ఒడ్డున కట్టి వేసివున్న పడవ కేసి ఒకటికి రెండు సార్లు చూడటం గమనించిన జీవదత్తుడు, ఖడ్గవర్మను రహస్యంగా, "ఈ యక్షవెధవ మనమంటే హడలిపోతున్నాడు. ఏ రాత్రి వేళనో పడవఎక్కి పారిపోతాడేమో, కాస్త మెలుకువగా వుండి చూస్తూవుండు," అని హెచ్చరించాడు.

ఖడ్గవర్మకూడా, మణిభూషణుణ్ణి గురించి యిలాంటి అనుమానమే వున్నది. ఆ కారణంచేత అతడు నిద్రపోతున్నట్టే నటిస్తూ, యక్షుణ్ణి ఒక కంట కనిపెడుతూనే వున్నాడు. నడిరేయివేళ నేలను మూచూస్తూ అక్కడికి ఒక ఎలుగు బంటూ, తోడేలూ వచ్చినై. అవి లేడి మాంసం వాసన పశికట్టి వుండాలి! ఆ రెండూ గిరికీలు తిరుగుతూ మణి భూషణుడి దగ్గరకు రాబోయేంతలో ఖడ్గవర్మ లేచికూర్చుని, వాటి మీదికి ఒక చిన్నరాయి విసిరాడు. ఆ వెంటనే ఎలుగు బంటూ, తోడేలూ చెట్లగుబురు కేసి పరిగెత్తినై. కాని, యీ అలికిడికి మణిభూషణుడు మేల్కొని, చుట్టూకలయచూస్తూ, "ఖడ్గ జీవదత్తుల్లారా! లేవండి, రాక్షసులు వచ్చి పడుతున్నారు!" అంటూ అరిచాడు.

—(ముగింపు వచ్చే సంచికలో.)






# శ్రమఫలితం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఇంతగా శ్రమపడు తున్నావుగాని, ఈ ప్రపంచంలో శ్రమ ఒకరిదీ, ఫలితం మరొకరిదీ కావటం కద్దు. అందుకు నిదర్శనంగా నీకు ఒక చిన్న కథ చెబుతాను. శ్రమ తెలయ కుండా విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం ఒక నగరాన్ని ఒక రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయనకు లేక లేక ఒక కుమార్తె కలిగింది. అల్లారు ముద్దుగా పెరిగి రాజకుమార్తె అన్ని విద్యలలోనూ ప్రవీణురాలై పెళ్లియీడుకు వచ్చింది.

## బేతాళ కథలు



రాజు తన కుమార్తెకు పెళ్ళి చేద్దామనే ఉద్దేశంలో ఉండగా ఆమెకు ఒక విచిత్రమైన వ్యాధి ఆరంభమయింది. ఆమె నిద్రాహారాలు మానేసి, పిచ్చి పిచ్చిగా మాట్లాడుతూ తనను తాను ఎరగని స్థితిలో పడింది. ఆమె రోజు రోజుకూ క్షీణించి పోతూ ఉండటం చేత రాజు ఆమెకు వైద్యులచేత ఎన్నో చికిత్సలు చేయించాడు. ఆ చికిత్సలేవీ పని చెయ్యక పోగా, ఆమె జబ్బు ఏమిటో కూడా వైద్యులకు అంతుచిక్కలేదు.

ఏమి చెయ్యటానికీ పాలుపోక, రాజు తన కుమార్తె వ్యాధి నివారణ చేసిన వాడికి ఆమె నిచ్చి పెళ్ళి చేస్తాననీ, తన అనంతరం రాజును చేస్తాననీ దేశదేశాలా దండోరా వేయించాడు. ఈ వార్త విని ఎంతలేసి ఘనవైద్యులో వచ్చారు. కాని ఒక్కరు కూడా రాజకుమార్తెకు స్వస్థత చేకూర్చ లేకపోయారు.

ఇలా ఉండగా ఆ నగరానికి ఒక సన్యాసి వచ్చి, ఊరి చివర దేవాలయంలో మకాం వేశాడు. ఆ సన్యాసి నగరంలోని ప్రజల రోగాలన్నిటినీ నయం చేయ సాగాడు. ఆయనను గురించి నగరమంతా ప్రచారం జరిగి, కొన్నాళ్ళకు రాజుగారి దాకా వెళ్ళింది.

ఆశ ఒకంతట చావదు గనక, రాజు తన కుమార్తెను మేనాలో ఎక్కించుకుని, సపరివారంగా దేవాలయానికి వెళ్ళి, సన్యాసిని కలుసుకున్నాడు.

సన్యాసి రాజకుమార్తెను చూసి, ఆమెకు జబ్బు ఏమీలేదనీ, ఒక బ్రహ్మరాక్షసి ఆమెను ఆవహించిందనీ రాజుకు చెప్పాడు.

"ఆ బ్రహ్మరాక్షసిని వదిలించే ఉపాయం ఏమిటి?" అని రాజు సన్యాసిని అడిగాడు.

"మహారాజా, రేపు నుంచీ మీ కుమార్తె చేత బ్రాహ్మణులకు దానధర్మాలు చేయించండి. ఉదయం మొదలుకుని సాయంకాలం దాకా వచ్చిన బ్రాహ్మ

ణులు ఏది కోరితే అది ఇప్పించండి. ఈమె ఎవడికైతే దానం ఇయ్యక నిరాకరిస్తుందో వాడే బ్రహ్మరాక్షసిని వదలగొట్టగల వాడు,'' అన్నాడు సన్యాసి.

రాజు మర్నాటి నుంచీ తన కుమార్తె చేత బ్రాహ్మణులకు దానధర్మాలు చేయించసాగాడు. ఎక్కడెక్కడి నుంచో బ్రాహ్మణులు వచ్చి దానాలు పుచ్చుకున్నారు. రాజకుమార్తె ఎవరికీ దానం నిరాకరించలేదు.

ఇలా ఒక సంవత్సరం గడిచింది. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు యాచన నిమిత్తం రాజ భవనానికి వచ్చాడు. అంత దూరానే అతన్ని చూసి రాజకుమార్తె, ''వాణ్ణి గెంటెయ్యండి! గెంటెయ్యండి!'' అని కేకలు వేస్తూ లోపలికి పారిపోయింది.

రాజు ఆ బ్రాహ్మణుడితో, ''అయ్యా, మీకు మంత్ర శాస్త్రం తెలుసునా? మా అమ్మాయిని ఎంతో కాలంగా పట్టి పీడిస్తున్న బ్రహ్మరాక్షసిని వదిలించగలరా?'' అని అడిగాడు.

బ్రాహ్మణుడు రాజకుమార్తెకు పట్టిన బ్రహ్మరాక్షసిని వదిలించాడు. రాజు అతనికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేద్దామనుకున్నాడు గాని, అదే సమయంలో సన్యాసి వచ్చి, ''రాజా, నీ కుమార్తెను నా కిచ్చి పెళ్ళి చేసి, నీ అనంతరం రాజ్యానికి నేను రాజు నవుతానని ప్రకటించు,'' అన్నాడు.



రాజు తన కుమార్తెను సన్యాసి కిచ్చి పెళ్ళిచేసి, ఆమెకు పట్టిన బ్రహ్మరాక్షసిని వదిలించిన బ్రాహ్మణుడికి లక్ష వరహాలు ఇచ్చి సత్కరించి పంపాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, రాజు అంత అన్యాయం ఎందుకు చేశాడు? తాను దండోరా వేయించిన ప్రకారం ఆ బ్రాహ్మణుడి కివ్వక తన కుమార్తెను సన్యాసి కిచ్చి ఎందుకు పెళ్ళిచేశాడు? సన్యాసి తనను శపిస్తాడని భయపడ్డాడా? లేక యాచకుణ్ణి అల్లుడుగా చేసుకోవటం కంటె, సన్యాసి అల్లుడు కావటం మేలనుకున్నాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు దండోరా వేయించిన నాటికి రాజకుమార్తెకు బ్రహ్మరాక్షసి పట్టినట్టు ఎవరికీ తెలియదు. అయినప్పటికీ రాజు బ్రాహ్మణుడికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేసి ఉండే వాడే. కాని సన్యాసి వచ్చి రాజు ప్రకటించిన సన్మానం తనకు చెందాలనగానే, అతని అర్హత రాజు గ్రహించాడు. రాజకుమార్తెకు చికిత్స చేసిన వాడు పెళ్ళాడే ఉద్దేశంతో రాలేదు, యాచించవచ్చాడు. రాజకుమార్తె అతను కోరినది ఇచ్చి ఉంటే అతను తనదారిన తానువెళ్ళేవాడే. సన్యాసి అలాకాదు. రాజకుమార్తెకు బ్రహ్మరాక్షసి పట్టిన సంగతి చెప్పటమే గాక, ఏ మనిషి దాన్ని వదలగొట్టగలడో సూచించటమే గాక, రాజకుమార్తెకు స్వస్థత కలగగానే ఆమెను వివాహం ఆడటానికి ఒక సంవత్సరమంతా వేచికూర్చున్నాడు. రాజకుమార్తె మామూలు మనిషికావటానికి పూర్తిగా సన్యాసే కారకుడు; మంత్రవేత్త అయిన బ్రాహ్మణుడు కేవలనిమిత్త మాత్రుడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)



# బెడిసికొట్టిన శాసనం

ఉదయనగరు మహారాజు హింస చేసిన ప్రజలను కఠినంగా శిక్షించేవాడు. కాని ఆయనకు వేట అంటే ప్రీతి. వేటాడటం తన శాసనానికే విరుద్ధం కావటం చేత, ఆయన మారువేషం వేసుకుని రాత్రివేళ అడవిలో వేటాడే వాడు.

ఒక రోజు అడవిలో ఉండే కోయవాడొకడు నగరంలో జింకమాంసం అమ్ముతూ రాజ భటులకు దొరికిపోయాడు. భటులు వాణ్ణి రాజు ఎదట పెట్టారు. రాజు వాడికి కొరడా దెబ్బల శిక్ష విధించాడు.

కొరడా దెబ్బలతో ఒళ్ళు మంటలెత్తి కోయవాడు తమ గూడెముకు తిరిగివెళ్ళాడు. కాని ఆ రాత్రి వాడికి ఏ మాత్రమూ నిద్రపట్టలేదు.

ఆ రాత్రి అడవికి వేటకు వెళ్ళిన రాజుకు ఏ జంతువూ దొరకలేదు. ఆయన నిరుత్సాహంతో తిరిగి వస్తూండగా కోయగూడెం వద్ద కోయవాళ్ళ కుందేళ్ళు కనిపించాయి. రాజు వాటిలో ఒకదాన్ని దొంగిలించబోయాడు. నిద్రపట్టక మేలుకుని ఉన్న కోయవాడు అది చూసి నలుగురినీ పిలిచాడు. కోయవాళ్ళు మారువేషంలో ఉన్న రాజును చెట్టుకు కట్టేశారు.

తెల్లవారి రాజభవనంలో రాజు కనిపించలేదు. నగరంలో అలజడి రేగింది. ఈ సంగతి తెలిసి కోయవాళ్ళు వెళ్ళి, మంత్రిని పిలుచుకు వచ్చి, చెట్టుకు కట్టి ఉన్న రాజును చూపారు.

అటు తరవాత గాజు అహింసా శాసనాన్ని రద్దుచేశాడు. —భిగుళ్ళ ఈశ్వర్‌రావు






కర్పూరదేశాన్ని ఏలే ఇంద్రసేన మహా రాజు ప్రజలను కన్న బిడ్డల కన్న మిన్నగా చూసుకుంటాడని ప్రసిద్ధి. అయితే ఆయనలో ఒక గొప్ప లోపం కూడా ఉండేది. ఆయనకు అమితమైన రాజ్య కాంక్ష ఉండేది; తరచుగా యుద్ధాలు చేసేవాడు. యుద్ధాలలో ఆయన అప జయం అన్నది ఎరగడు. ఆయన ఏలు బడిలో ప్రజలు ఎంతో సుఖపడే వారు కనక, ఆయన కిందికి వచ్చిన ఏ రాజ్యం లోనూ ప్రజలు తిరుగుబాటు చేయటం అంటూ జరిగేదికాదు.

ఇంద్రసేనుడి పద్ధతి ఆయన మంత్రి అయిన సుదర్శనుడికి నచ్చేది కాదు. యుద్ధాల మూలంగా కలిగే అపార జన నష్టమూ, ధననష్టమూ చూసి ఆయన బాధపడే వాడు. అయితే, ప్రపంచమంతా జయంచాలన్న కాంక్షగల ఇంద్రసేనుడితో యుద్ధాలు మానమని చెప్పటం దుస్సా హసం. కాని, రాజ్యకాంక్ష అనే వ్యసనం లేకపోతే ఇంద్రసేనుడి వంటి ఉత్తముడు ఉండబోడు. ఆయన వ్యసనాన్ని తొల గించే అవకాశం కోసం మంత్రి సుదర్శ నుడు ఎదురు చూడసాగాడు.

ఇంద్రసేనుడు సరి కొత్తగా లాక్షణిక దేశాన్ని జయించాడు. ఆ దేశాన్ని పాలిం చిన సులక్షణుడు అనేరాజు యుద్ధంలో ఓడి పారిపోయి, తన దేశానికి పొరుగున ఉన్న సౌగధింక దేశపురాజు భీమసేనుడి శరణుజొచ్చాడు. సౌగంధికదేశం విశాల మైనది, సుభిక్షమైనది, అపారమైన సైనిక బలం కలది. అయితే ఆదేశాన్ని ఏలే భీమసేనుడు శాంతి కాముకుడు. ఏ దేశం మీదా అతను యుద్ధానికి వెళ్ళే వాడు కాడు; ఏ రాజుకూ అతనిపై యుద్ధానికి రావటానికి సాహసం లేదు.

"వసుంధర"

భీమసేనుణ్ణి జయించాలన్నది ఇంద్రసేనుడి జీవితాశయాలలో ఒకటి. భీమసేనుడు సులక్షణుడికి ఆశ్రయం ఇయ్యటం మూలాన భీమసేనుడి పైకి యుద్ధానికి వెళ్ళే అవకాశం ఇంద్రసేనుడికి ఇప్పుడు కలిగింది. సులక్షణుణ్ణి తనకు వశపరచవలసిందని ఇంద్రసేనుడు భీమసేనుడికి కబురుపంపించాడు. భీమసేనుడు అందుకు నిరాకరించాడు. ఈ మిషమీద ఇంద్రసేనుడు భీమసేనుడితో యుద్ధం చెయ్యటానికి సన్నాహాలు ఆరంభించాడు. ఇందుకుగాను అతను లాక్షణిక దేశంలో మకాం పెట్టి, సైన్యాన్ని సమీకరిస్తూ, తన వేగులవాళ్ళను సౌగంధిక దేశానికి పంపాడు. అలా వెళ్ళిన ఇంద్రసేనుడి వేగులవాళ్ళ నాయకుడు చారుదత్తుడు.

ఈ లోపల భీమసేనుడు చేతులు ముడుచుకు కూర్చోలేదు. ఇంద్రసేనుడి రాజ్యకాంక్ష భీమసేనుడికి తెలుసును. ఇంద్రసేనుడు చాలా రోజులుగా లాక్షణిక దేశంలోనే మకాం చేసినట్టు కూడా ఆయన ఎరుగును. అందుచేత ఆయన తన చారులను రుద్రుడు అనే సమర్థుడి నాయకత్వం కింద లాక్షణిక దేశానికి పంపి, ఇంద్రసేనుడి ఎత్తులు తెలుసుకోవటానికి ప్రయత్నించాడు.

రుద్రుడు వేగువిద్యలో అరితేరినవాడు. అతను లాక్షణిక దేశానికి బయలుదేరే ముందు సులక్షణుణ్ణి కలుసుకుని,





లాక్షణిక దేశంలో ఆయన కున్న మిత్రు లెవరో వివరంగా తెలుసుకున్నాడు. కాని అందువల్ల లాభం లేకపోయింది. దానికి కారణం ఉన్నది.

ఇంద్రసేనుడి చేతిలో ఓడిపోయిన సులక్షణుడు పరిపాలనలో సమర్థత ఏమీ లేనివాడు. లాక్షణిక దేశం తన ఏలుబడి లోకి రాగానే ఇంద్రసేనుడు పరిపాలనలో అనేక సంస్కరణలు తెచ్చి, ప్రజాభి మానానికి పాత్రుడు అయాడు. సులక్ష ణుడికి మిత్రులుగా ఉండిన వారందరూ ఇప్పుడు ఇంద్రసేనుడి మిత్రులయి పోయి అతడికి సహాయపడుతున్నారు. ఈ కారణం చేత భీమసేనుడి ప్రధాన చారుడైన రుద్రుడు సులువుగా ఇంద్ర సేనుడికి దొరికిపోయాడు.

బందీ అయిన రుద్రుడి ద్వారా ఇంద్ర సేనుడూ, అతని మంత్రీ సౌగంధిక దేశ రహస్యాలను రాబట్టటానికి ఎంతో ప్రయత్నించారు. కాని, రుద్రుడు తాను లాక్షణిక దేశం వాణ్ణి అనీ, తనకు సౌగంధిక దేశం గురించి ఏమీ తెలియదనీ అన్నాడు.

ఇంద్రసేనుడికి కోపంవచ్చి తన మంత్రితో, "ఈ రాజద్రోహిని ఉరి తీయించండి," అన్నాడు.

ఆ మాటకు రుద్రుడు చిన్నగా నవ్వి, "మీరు నన్ను రాజద్రోహి అంటున్నారు. కాని నన్ను ఏ ఇంట్లో నైతే పట్టుకున్నారో, ఆ ఇంట్లోనే యింకా ముగ్గురు రాజద్రోహు లున్నారు. తమరు ఆ సంగతి విచారిం చండి," అన్నాడు.

"అనవసర ప్రసంగం కట్టిపెట్టి, అసలు సంగతి చెప్పు," అన్నాడు ఇంద్ర సేనుడు.

రుద్రుడు నవ్వి, "ఆ ఇంట్లో ఒక ముసలాయన ఉన్నాడు. ఆయన కాలంలో ఈ దేశాన్ని సూర్య వంశపు రాజులు పాలించే వారు. అప్పుడు యుద్ధం జరిగి, ఈ దేశం చంద్రవంశపు రాజుల ఏలుబడి కిందికి వచ్చింది.

ముసలాయన చంద్ర వంశపు రాజులను ప్రభువులుగా ఆమోదించాడు. ఆ విధంగా ఆయన రాజద్రోహి అయాడు. తరవాత చంద్రవంశపు రాజును సులక్షణుడి తండ్రి జయించాడు. ముసలాయన కొడుకు సులక్షణుడి తండ్రిని సేవించి, తనూ రాజద్రోహం చేశాడు. ముసలాయన మనవడి కాలంలో మీరు సులక్షణుణ్ణి తరిమేసి ఏలిక అయారు. అతగాడు, నన్ను సులక్షణుడి మిత్రుణ్ణన్న అను మానంతో మీకు అప్పగించాడు. అతగాడు కూడా రాజద్రోహే గదా!'' అన్నాడు.

ఈ మాటలు విని ఇంద్రసేనుడి మనసు అదోలాగయిపోయింది. ఆయన ఒక్క నిమిషం ఆలోచించి, ''వాళ్ళ సంగతి ఏమయినా, నువు నిస్సందేహంగా రాజద్రోహివి!'' అన్నాడు.

''పట్టుబడే క్షణం క్రితం కూడా నేను రాజభక్తుణ్ణే. రాజభక్తుడికీ, రాజద్రోహికీ మధ్య ఒక్క క్షణం తేడా!'' అన్నాడు రుద్రుడు.

''మూర్ఖుడా, నువు మళ్ళీ రాజభక్తుడివి కావాలంటే కాల చక్రం వెనక్కు తిరగాలి!'' అంటూ ఇంద్రసేనుడు బయటికి వచ్చేశాడు.

ఆయన వెంట బయటికి వచ్చిన మంత్రి సుదర్శనుడు ఆయనతో, ''ప్రభువులు మన్నిస్తే, రుద్రుణ్ణి రాజభక్తుణ్ణి చెయ్యటానికి కాలచక్రం వెనక్కు తిరగనవసరం లేదు. మరొక మార్గం ఉంది.



ముందు ఈ లేఖ చూడండి,'' అంటూ రాజుకు ఒక లేఖ అందించాడు.

ఆ లేఖ చూసి ఇంద్రసేనుడు కలవర పడ్డాడు. తన చారులలో ఉత్తము డయిన చారుదత్తుడు భీమసేనుడికి దొరికిపోయాడు. ఎలాంటి హానీ కలిగించ కుండా రుద్రుణ్ణి వదిలి పెట్టేటట్టయితే చారుదత్తుణ్ణి వదులుతానని భీమ సేనుడు ఆ లేఖ ద్వారా ఇంద్రసేనుడికి తెలియజేశాడు.

''కర్తవ్యం ఏమిటి?'' అని ఇంద్ర సేనుడు తన మంత్రిని అడిగాడు.

''రుద్రుణ్ణి వదిలెయ్యటమే!'' అన్నాడు సుదర్శనుడు.

''అతన్ని రాజభక్తుడుగా మార్చటా నికి ఏదో మార్గం ఉందన్నావు?'' అని ఇంద్రసేనుడు జ్ఞాపకంచేశాడు.

''మన సరిహద్దు దాటగానే రుద్రుడు రాజభక్తుడై పోతాడు. రాజభక్తుడికీ, రాజద్రోహికీ సరిహద్దు గీతే అడ్డం,'' అన్నాడు సుదర్శనుడు.

''అంతే నంటావా? అయితే నేను చేసే యుద్ధాలు....?'' అన్నాడు ఇంద్ర సేనుడు.

''నిష్ప్రయోజనం, ప్రభూ. ప్రజలకు ఏలుబడి ముఖ్యంగాని, ఏలికకాదు. రాజభక్తుడూ, రాజద్రోహీ అన్న మాటల లాగే మన దేశమూ, పరదేశమూ అన్న పదాలు కూడా అర్థం లేనివి. యుద్ధం చేసి మీరు సౌగంధిక దేశాన్ని మీది చేసు కోవాలనుకుంటున్నారు. అందువల్ల రక్త పాతమూ, అమాయకులు బలికావటమూ తప్ప ఏమీ జరగదు. మీ కోరిక తీర్చు కునే మార్గం మరొకటుంది. భీమసేనుడి మైత్రి!'' అన్నాడు మంత్రి సుదర్శనుడు.

ఇంద్రసేనుడికి తన మంత్రి మాట లలో గురికుదిరింది. ఆయన రుద్రుణ్ణి వదిలిపెట్టి, భీమసేనుడితో స్నేహసంధి చేసుకున్నాడు. చారుదత్తుడు నిజంగా పట్టుబడలేదని తెలిసింది, కాని ఆ అసత్య వార్త తన మంత్రి కల్పించినదేనని ఇంద్రసేనుడు ఎరగడు.



# ఉపాధ్యాయుడికి దండన

ఈ కథ నలభై ఏళ్ళ క్రితం నిజంగా జరిగింది.

ఒక బస్తీ స్కూలులో రివరెండ్ అరుల్‌స్వామి అనే ఉపాధ్యాయుడు ఉండే వాడు. ఆయనకు విద్యార్థులంటే ఇష్టం; విద్యార్థులకు ఆయన అంటే ఇష్టం. ఆయన మాకు లెక్కలు చెప్పేవాడు. లెక్కలంటే ఇష్టంలేని నాకు కూడా ఆయనంటే ఇష్టం.

ఒక రోజు క్లాసులో ఒక చిత్రం జరిగింది. అంతకు ముందు మా మేస్టరు మాకు నాలుగు లెక్కలిచ్చి, ఇంటి వద్ద చేసుకు రమ్మన్నాడు. మా క్లాసులో ఒక్కడు తప్ప అందరమూ లెక్కలు చేసుకువచ్చాము. ఆ ఒక్కడూ లెక్కలు చెయ్యనందుకు సిగ్గుపడక పోగా చాలా గర్వపడ్డాడు.

అరుల్‌స్వామి క్లాసులోకి నవ్వుతూ వచ్చి ఒక్కొక్కరి లెక్కలూ చూసి మార్కులు వేశాడు. ఆ కుర్రవాడి వంతు వచ్చినప్పుడు అతను తాను ఇంటి దగ్గిర లెక్కలు చెయ్యలేదన్నాడు. "ఎందుకు చెయ్యలేదు? లెక్కలు రాలేదా?" అని మేస్టరు అడిగాడు.

"వచ్చును. కాని చెయ్యలేదు," అన్నాడు విద్యార్థి.

"హెడ్మాస్టరు గదికి వెళ్ళి బెత్తం పట్టుకురా," అన్నాడు మేస్టరు. విద్యార్థి బెత్తం తీసుకుని వచ్చాడు. మేస్టరు అతన్ని క్లాసుకు ఎదురుగా నిలబడమన్నాడు. ఆయన అతన్ని కొడతాడని అందరమూ అనుకున్నాం.

కాని, అరుల్‌స్వామి చెయ్యి చాచి, "నేను నీకు ఇష్టంలేని లెక్కలు ఇచ్చి, నీకు అనంతృప్తి కలిగించాను. నువు నన్ను శిక్షించవచ్చు. కొట్టు!" అన్నాడు.

విద్యార్థి వణికిపోతూ, బెత్తం చివర మేస్టరు చేతికి అనించి, బావురుమని ఏడుస్తూ, మేస్టరు కాళ్ళమీద పడి క్షమాపణ చెప్పుకున్నాడు.

—ఎం. దండపాణి





# ఋణవిముక్తి

ఒక గ్రామంలో రంగనాథం అనే పరమ లోభి ఒకడు ఉండెవాడు. అతను తన ఇంటి మీద పిచ్చుక వాలనా సహించ లేక పోయేవాడు; బోలెడంత కూడబెట్టి కూడా కటిక దరిద్రుడిలా బతికేవాడు.

రంగనాథం భార్య చచ్చిపోయింది. తెలివి తేటలు లేని కొడుకు ఒకడు ఉన్నాడు. రంగనాథం వాడికి గంజినీళ్లు మాత్రమే పెట్టేవాడు. వాడు తిండికి ముఖం వాచి, కానీ దొరికితే చాలు, మిఠాయి దుకాణానికిపోయి, ఏదో ఒకటి కొనుక్కు తినేవాడు.

డబ్బు కూడబెట్టటానికి రంగనాథం ఒక ఉపాయం చేశాడు. అతను తన ఇంట్లో ఒక మూల గొయ్యితీసి, అందులో ఒక బిందె పాతిపెట్టి, దాని మీద పెట్టిన మూతలో డబ్బులు పట్టేటంత సందు ఉంచి, ఆ సందు తప్ప, పైకి బిందెజాడ ఏమీ కనబడకుండా చేశాడు. అతను తనకు వచ్చే డబ్బులో స్వల్పంగా ఖర్చుకు ఉంచుకుని, మిగిలినది బిందెలోకి జార విడిచేవాడు.

తండ్రి ఇలా చెయ్యటం కొడుకు ఒకనాడు చూశాడు గాని, డబ్బులను తండ్రి భూమిలో ఎందుకు వేస్తున్నదీ ఊహించలేక పోయాడు. వాడు తన తండ్రిని, "అదేమిటి, నాన్నా? ఇంకో పూటకు నూకలైనా కొనకుండా చిల్లర డబ్బులు భూమిలోకి జారవిడుస్తున్నావు?" అని అడిగాడు.

రంగనాథం వాడితో, "చూడు, బాబూ. భూమిలో మనకు అప్పుపెట్టిన ఋణ దాతలున్నారు. వారికి మనం చాలా ఇయ్యవలసి ఉంది. మనం పేదవాళ్ళం గనక ఒక్కసారిగా అంతా ఇచ్చుకోలేం. రోజూ కొంచెం కొంచెంగా వారికి ముట్ట

బూర్లె నాగేశ్వరరావు

జెప్పుతున్నాను. నేను వేసే ప్రతి చిల్లి గవ్వా వారికి ముట్టుతుంది," అన్నాడు.

ఈమాట కొడుకు నమ్మేసి, తన తండ్రి లోభిగా బతకటం ఇందుకే కాబోలు నను కున్నాడు. వాడికి ఋణదాతలమీద కోపం కూడా కలిగింది. వాడు తండ్రితో, "వాళ్ళమూలాన్నేగదా మనం కడుపు కట్టుకుంటున్నాం? వాళ్ళకు ఇయ్యటం మానేసి మనం రెండు పూటలా కడుపు నిండా తింటే సరి," అన్నాడు.

కొడుకు ధోరణి చూస్తే వాడు తన ప్రయత్నానికి అడ్డంతగిలేటట్టు కనిపించే సరికి, వాణ్ణి బెదరగొట్టటానికి రంగనాథం, "చూడు, బాబూ! వాళ్ళు సామాన్యులు కారు. ఒక్క రోజు మనం డబ్బులు వెయ్యటం మానితే, పెద్దపెద్ద కత్తులతో వాళ్ళు మనని నరకటానికి వస్తారు," అన్నాడు.

రంగనాథం కొడుకు బుర్రలో ఈ మాటలు నాటుకున్నాయి.

చలికాలంలో ఒక రాత్రి భోజనాలవేళ ఒక బైరాగి వచ్చి, "ధర్మదాతలు, పట్టెడు అన్నం పెట్టించండి," అంటూ తలుపుతోసి లోపలికి వచ్చాడు.

అది చూసి రంగనాథానికి పట్టరాని ఆగ్రహం వచ్చి, "ఇది మీ తాత కట్టించిన ధర్మసత్రం కాదు," అని అరిచాడు.



బైరాగి బిత్తరపోయి. "అయ్యా, భోజనం సంగతి దేవుడెరుగు. ఈ రాత్రికి నన్నీ వసారాలో పడుకోనియ్యండి. చాలా చలిగా ఉంది. నేనీ వూరికి కొత్తవాణ్ణి," అని ప్రాధేయపడ్డాడు.

రంగనాథం మరింత మండిపడి, "చెప్పుతూంటే మనిషివి కాదూ? నీకు పరిచర్యలు చెయ్యటానికి నేనేమన్నా బాకీ ఉన్నానా? వెళ్ళు!" అంటూ ఆ బైరాగిని మెడపట్టి బయటికి గెంటాడు.

"నాకు కాకపోతే మరెవరికో బాకీ ఉండటం మూలాన్నే ఇలా పస్తులుంటూ కూడబెట్టుతున్నావు. నువు సంపాదించిన దంతా మరెవడికో దక్కుతుంది. దాన్ని



అనుభవించే అర్హత నీకుండదు,'' అన్నాడు బైరాగి.

''నీలాటి పాపిష్ఠిముఖాలను ఇంట్లోకి రానిస్తే అదే జరగవచ్చు. ఈ రాత్రి బయట చలిలో అఘోరించావంటే నీకూ తెలుస్తుంది అనుభవం,'' అన్నాడు రంగనాథం కసిగా.

''సమయం వస్తే నీకూ అదేగతి పట్టుతుంది. మిడిసిపడకు!'' అన్నాడు బైరాగి.

''లంకంత ఇల్లు ఉండగా నా కెందుకు అలా జరుగుతుందిరా? వీధులన్నీ ఉన్నది నీలాంటి వెధవల కోసమేరా!'' అంటూ రంగనాథం దభీమని తలుపు మూశాడు.

కొన్నాళ్ళ అనంతరం రంగనాథానికి అనుకోకుండా ప్రయాణం తగిలింది. అతను తన కొడుకుతో, ''ఒరేయ్, ఇల్లు జాగ్రత్త. రోజూ వచ్చిన డబ్బులు భూమిలో వేస్తూ ఉండు. నేను రెండు, మూడు రోజుల్లో తిరిగి వస్తాను,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

రంగనాథం కొడుకు, చేతికి అందిన చిల్లరడబ్బులు భూమిలో వెయ్యటం ఇష్టంలేక, దానితో యథేచ్ఛగా కొనుక్కు తిన్నాడు. ఇలా రెండు రోజులు గడిచింది. మూడో రోజు రాత్రి ఒక చిత్రం జరిగింది. అర్ధరాత్రివేళ ఎవరో తలుపుకొట్టారు. రంగనాథం కొడుకు నిద్రమోహంతో లేచి వెళ్ళి తలుపుతీశాడు. ముగ్గురు దొంగలు కత్తులూ, కటార్లతో లోపలికి వచ్చారు.

కుర్రవాడికి వాళ్ళను చూడగానే తండ్రి ఎప్పుడో చెప్పిన మాట గుర్తు కొచ్చింది. వాళ్ళు తప్పక ఋణదాతలై ఉంటారనుకున్నాడు వాడు. తాను రెండు రోజులుగా వాళ్ళకు డబ్బువెయ్యలేదు!

వాడు వాళ్ళతో, ''అయ్యా, ఋణదాతలూ! మన్నించండి! డబ్బు చేతికి రానందున రెండు రోజులుగా భూమిలో డబ్బు వెయ్యనిమాట నిజమే. మా నాన్న గనక ఇంట్లో ఉంటే మీ డబ్బు ఎంతో కొంత వెయ్యకుండా నిద్రపోయేవాడు

కాడు. ఆయన ఊళ్ళో లేడు. నాకు ఆ పని చెయ్యటం చేతకాలేదు. రేపు మీ డబ్బు మొత్తం అంతా అందులో వేస్తాను. ఈ సారికి నన్ను వదిలి వెయ్యండి!'' అన్నాడు.

వాడు ఏమంటున్నదీ వాళ్ళకు అర్థం కాలేదు. కాని డబ్బు ఎక్కడో తమకోసం వేస్తున్నట్టు వాళ్ళకు స్పష్టమయింది. వారిలో ఒకడు కుర్రవాడితో, ''ఏదీ? మీ నాన్న డబ్బు ఎక్కడ వేస్తున్నాడు? చాలాకాలంగా మాకు డబ్బు చేరలేదే?'' అన్నాడు.

రంగనాథం కొడుకు అక్కడవున్న మంచం పక్కకు నెట్టి, బిందె పాతినచోటు దొంగలకు చూపాడు. దొంగలు అక్కడ తవ్వి, బిందెను పైకి తీశారు. దాని నిండా మొయ్యలేనంత చిల్లర ఉన్నది. దొంగలు దాన్ని తీసుకుని వెళ్ళిపోయారు.

మర్నాడు రంగనాథం ఊరు నుంచి తిరిగి వచ్చి, బిందె ఉండవలిసిన చోట గొయ్యి చూసి, లబో దిబో మన్నాడు. ''నా బిందె! నా డబ్బు!'' అంటూ బావురుమని ఏడుస్తూ, జుట్టు పీక్కున్నాడు.

తండ్రి ప్రవర్తన చూసి కొడుకు, ''అదేమిటి, నాన్నా, మన సొమ్మంతా దొంగలెత్తుకుపోయినట్టు బాధపడుతున్నావు?'' అని అడిగాడు.




''అయితే, తీసి దాచావా?'' అని రంగనాథం కొడుకును అడిగాడు ఆశగా.

''నువ్వేమీ కంగారు పడకు. అది వాళ్ళసొమ్మే గనక వాళ్ళను తీసుకుపోనిచ్చాను,'' అన్నాడు కొడుకు.

రంగనాథానికి ఒళ్ళు మండిపోయింది. అతను తన కొడుకు గొంతు పట్టుకుని, ''ఎవర్రా వాళ్ళు? నా సొమ్ము వాళ్ళదెలా అవుతుంది?'' అని అరిచాడు.

''అదే, నాన్నా! ఆనాడు నువు చెప్పావు చూడూ, ఆ ఋణదాతలే వచ్చారు. నేను వాళ్ళను బాగా గుర్తించాను కూడా,'' అంటూ కొడుకు రంగనాథానికి జరిగినదంతా వివరించాడు.

"ఒరేయ్, బుద్ధి గడ్డి తిని నీతో అలా చెప్పాను! ఆ వచ్చింది పచ్చి దొంగలురా! నీ తెలివి తక్కువ మూలాన నా కొంప నిలువునా అరింది. ముక్కూ మొహమూ తెలియని వాళ్ళు వచ్చి అర్ధరాత్రి తలుపు కొట్టితే, బుద్ధి ఉన్నవాడివైతే తలుపులు తీస్తావుట్రా?" అన్నాడు రంగనాథం.

అవును! తనవల్ల పొరపాటే జరిగింది. ఇంకెప్పుడూ అలా చెయ్యరాదని నిర్ణయించుకున్నాడు రంగనాథం కొడుకు.

తనకు జరిగిన అన్యాయం గురించి న్యాయస్థానానికి ఫిర్యాదు చేసినట్టయితే తన డబ్బు గురించి అందరికీ తెలిసి పోతుందని, రంగనాథం రాత్రివేళ దొంగలను అన్వేషిస్తూ చుట్టుపట్ల గ్రామాలు తిరగసాగాడు. అతను ఒకరోజు అర్ధరాత్రి ఇంటికి తిరిగి వచ్చి తలుపు కొట్టాడు. లాభం లేకపోయింది. కొడుకును పిలిచాడు. ఎంతగా గొంతు చించుకుని అరిచినా ప్రయోజనం లేకపోయింది. తన కొడుకు మతిమాలిన వాడయినందుకు విచారిస్తూ, రంగనాథం వీధి తలుపుకు చేరగిల బడ్డాడు. చలికి ఒళ్ళు కొంకర్లు పోయింది. తెల్లవార్లూ చలికి బిగిసి, తెల్లవారగట్ల రంగనాథం కునుకు తీశాడు.

ఆ సమయంలో అటుగా వెళుతున్న బైరాగి రంగనాథాన్ని తట్టిలేపి, "అయ్యా, లంకంత ఇల్లు ఉండగా, ఈ చలిలో ఇలా వీధిలో పడుకున్నావేం?" అని అడిగాడు.

"ఏం చెప్ప మంటావు? ఆనాడు నువ్వన్న మాటలు శాపంలా తగిలాయి. ఒకడికి పెట్టకుండా, నేను తినకుండా కూడబెట్టినదంతా దొంగలు దోచుకున్నారు," అన్నాడు రంగనాథం.

"అలా అనుకోవద్దు. వాళ్ళు దొంగలు కారు. ఋణదాతలు. ఋణవిముక్తి అయినందుకు సంతోషించండి," అంటూ బైరాగి సాగిపోయాడు.

ఆ నాటి నుంచీ రంగనాథం మారిపోయి, తాను తింటూ, ఇతరులకు ఇంత పెట్టుతూ, సుఖంగా చాలాకాలం జీవించాడు.







# మహిమ

ఒకనాటి ఉదయం ఒక నగరంలోకి ఒక అతిస్థూలకాయుడు ప్రవేశించాడు. అంతటి ఒడ్డూ, పొడుగూ ఏ మానవ మాత్రుడికీ ఉండదు. ఈ స్థూలకాయుడు ఒంటి నిండా నల్లటి బట్ట కప్పుకుని ఉన్నాడు. వాడి లావుపాటి జబ్బకు ఒక తాయత్తు కట్టి ఉన్నది. వాణ్ణి చూసి పిల్లలు దడుచుకుని పారిపోయారు; ఆడ వాళ్ళు ఇళ్ళ తలుపులు మూసుకున్నారు.

వాడు అతి కష్టం మీద తన స్థూల శరీరాన్ని ముందుకు నడిపిస్తూ, "తాయత్తు మహిమ తెలుసుకోవాలంటే త్వరగా రండి," అని అరుస్తున్నాడు. కాని వాడు మాయగాడేమోనని భయపడి, ఎవరూ వాణ్ణి సమీపించలేదు.

అయితే ఆ ప్రాంతంలో ఏ కాకిగా నివసిస్తున్న మరిడయ్యా అనేవాడు, తాయత్తు మహిమ తెలుసుకోవాలని కుతూహలం పుట్టి, స్థూలకాయుడితో, "అబ్బీ, తాయత్తు మహిమ ఏమిటో నాకు చూపించు," అన్నాడు.

స్థూలకాయుడు మరిడయ్యా కేసి ఎగాదిగా చూసి, "నా వెంటరా!" అంటూ మరిడయ్యాను ఊరి బయటికి తీసుకుపోయి, మర్రిచెట్టు కింద ఆగి, తన జబ్బకు కట్టి ఉన్న తాయత్తు విప్పాడు. అంత పెద్ద జబ్బకు సరిపోయిన తాయత్తు మామూలు మనిషి జబ్బకు సరిపోయే దానిలాగా చిన్నదై పోయింది.

"ఇదేనా తాయత్తు మహిమ?" అని మరిడయ్యా చప్పరించాడు.

"అప్పుడే ఏం చూశావు. నేను దీన్ని నీ జబ్బకు కట్టి వెళ్ళి పోతాను. నేను నీకు కనపడకుండా పోయినాక గాని దీని మహిమ నీకు తెలీదు. నువు దీన్ని వదిలించు కోవాలంటే మరెవడి జబ్బకైనా

---

ఎం. కామేశ్వరరావు




కట్టాలి గాని మరో మార్గంలేదు,'' అంటూ ఆ స్థూలకాయుడు, మరిడయ్యా ఏదో అడగబోతే కూడా వినిపించు కోకుండా, తాయత్తు మరిడయ్యా జబ్బకు కట్టి, గబ గబా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళినవైపే చూస్తూ ఉండిన మరిడయ్యా, తన జబ్బకు కట్టి ఉన్న తాయత్తును చూసి అదిరిపడ్డాడు. తర వాత తన శరీరమంతా కలయ చూసు కుంటే వాడికి మూర్ఛ వచ్చినట్టయింది. మరిడయ్యా అతిస్థూలకాయుడు అయి పోయాడు.

మరిడయ్యా నెత్తి, నోరూ బాదుకుంటూ ఆ మనిషి వెళ్ళినవేపే ఆయాసపడుతూ పరిగెత్తాడు. వీధి మలుపు తిరిగే సరికి దూరంగా ఒక సన్నని మనిషి నల్లబట్ట కప్పుకుని పోతూ కనిపించాడు. మరి డయ్యకు తాయత్తు మహిమ తెలిసింది. తాయత్తును వదిలించుకుంటే స్థూల కాయంపోయి, మామూలు మనిషి కావచ్చు.

తన ఇంటి కేసి తిరిగి వచ్చిన మరి డయ్యను చూసి ఎరిగినవాళ్ళు నిర్ఘాంత పోయి, "ఇందులో ఏదో మోసం ఉందని మేం ముందే అనుకున్నాం. ఆ దరిద్ర గొట్టు తాయత్తును తెంపి అవతల పారెయ్యి," అన్నారు.

వారి సలహా పాటించి మరిడయ్యా తాయత్తును విప్పి దూరంగా గిరవాటు వేశాడు. కాని అది వెంటనే వచ్చి మరిడయ్యా జబ్బకు అంటుకున్నది. అంతే కాదు, ఇప్పుడది నిప్పులా కాలటం మొదలు పెట్టింది. మరిడయ్యా దాన్ని తీసే ప్రయత్నం మానుకున్నాకనే అది చల్లబడింది.

మరిడయ్యకు పెద్ద చిక్కే వచ్చింది. నెల పొడుగునా తినటానికి తెచ్చుకున్న తిండిగింజలు రెండు రోజులు కూడా రాలేదు. కాయకష్టం చేసుకునే మరి డయ్య కదల్చటానికే సాధ్యంకాని స్థూల శరీరంతో నానా అవస్థా పడవలసి వచ్చింది. ఒక్క తిండికే తన కున్న

దంతా అనుకుని, మరిడయ్య తనకిక చావు తప్ప శరణ్యం లేదనుకుని, ఊరి బయట ఉన్న మర్రిచెట్టు కిందికి చేరి, చావుకోసం ఎదురు చూడసాగాడు.

అపరాహ్ణం వేళ, పొరుగూరి నుంచి అటుగా వస్తున్న ఒక బక్కచిక్కి ఉన్న మనిషి మర్రిచెట్టు కింద ఆగి, మరిడయ్య శరీరం కేసి చూసి, "గురువుగారూ, నా పేరు వెంకయ్య. ఒళ్ళు లావెక్కటానికి చిట్కా ఏమన్నా ఉంటే చెబుతారా? అస్థిపంజరంలా ఉండటం చేత నాకు పెళ్ళి కాకుండా ఉన్నది." అన్నాడు.

ప్రాణం లేచి వచ్చినట్టయి, "అంతా తాయత్తు మహిమ!" అన్నాడు మరిడయ్య.

"ఆ మహిమ ఏమిటో నాకు చూపిద్దురూ," అన్నాడు వెంకయ్య.

మరిడయ్య తన జబ్బకు ఉన్న తాయత్తు విప్పి, వెంకయ్య జబ్బకు కట్టుతూ, "నేను కనుమరుగై వెళ్ళిపోయాక గాని దీని మహిమ నీకు తెలియదు. నువు ఈ తాయత్తును వదిలించుకోవాలంటే దాన్ని మరొకరి జబ్బకు కట్టవలిసి ఉంటుంది. దాన్ని పొరపాటున కూడా ఊడతీసి పారెయ్యకు. నిప్పు కాల్చినట్టు నిన్ను కాల్చుతుంది." అని చెప్పి, బతుకు జీవుడా అని తన దారిన తాను ఇంటికి వెళ్ళిపోయాడు.

అతను కనపడకుండా పోయినదాకా చూసి తన శరీరం కేసి చూసుకునే సరికి






వెంకయ్యకు తలతిరిగి నట్టయింది. అతని శరీరం అతిస్థూలంగా తయారయింది. అతను తన ఊరు వెళ్ళాడు గాని, అంత స్థూలంగా ఉన్నవాడికి ఎవరూ పిల్ల నిచ్చారు కారు. హతాశుడై వెంకయ్య తిరిగి నగరం చేరుకున్నాడు.

వెంకయ్య కిప్పుడు శవంలాగా ఉన్నప్పుడే సుఖంగా ఉండి నట్టు స్పష్టమైంది. అతనికి కూడా తిండి సమస్య ఏర్పడింది. అతను కాషాయ వస్త్రాలు ధరించి, ఇల్లిల్లూ తిరిగి ముష్టి ఎత్తుతూ, ఎలాగో జీవించసాగాడు. కాని ఆ తిరగటాని కైనా అతని స్థూల శరీరం లొంగలేదు. నాలుగిళ్ళు తిరిగేసరికి ఆయాసం వచ్చేది.

ఒకనాడు వెంకయ్య ఒక ఇంటి తలుపు తట్టాడు. ఆ ఇంట్లో ఒక బ్రహ్మచారిణి ఉంటున్నది. ఆమె వికారి కావటం చేత పెళ్ళికాలేదు. ఆమె తలుపు తెరిచి, వెంకయ్య కాషాయవస్త్రాలు చూసి, ''అందంగా కనిపించటానికి కిటుకు ఏమైనా ఉన్నదా, స్వామీ?'' అన్నది.

వెంకయ్య బుర్ర మెరుపులా పని చేసింది. ''లేకేమి? తాయత్తు ఉన్నది.'' అని జవాబిచ్చాడు.

''ఆ తాయత్తు నా కిచ్చి పుణ్యం కట్టుకోండి.'' అన్నది బ్రహ్మచారిణి.

వెంటనే వెంకయ్య తన తాయత్తు విప్పి ఆమె జబ్బకు కట్టుతూ, ''నేను కనిపించ కుండా వెళ్ళిన తరవాతనే ఈ తాయత్తు మహిమ నీకు తెలుస్తుంది. దీన్ని వదిలించాలంటే మరొకరి జబ్బకు కట్టటం తప్ప మార్గాంతరం లేదు.'' అని చెప్పి, మళ్ళీ ఆమెకు కనిపించకుండా వెళ్ళిపోయాడు.

బ్రహ్మచారిణి లోపలికి వెళ్ళి, తన అందం చూసుకోవటానికి నిలువు టద్దం ముందు నిలబడి, తుళ్ళి పడింది. అంత నిలువు అద్దంలోనూ ఆమె శరీరంలో నాలుగో వంతు కూడా కనపడటం లేదు. ఆమె నేల మీద పడి పొర్లుతూ, సాయంకాలందాకా శోకాలు పెట్టింది.

చుట్టు పక్కల వాళ్ళు వచ్చి ఆమెను చూశారు. అలా వచ్చినవారిలో ఆ నగరపు యువరాణి పరిచారిక కూడా ఉన్నది. బ్రహ్మచారిణిని చూడగానే ఆమె విరగబడి నవ్వుతూ, ''యువరాణీ వారు నవ్వి నాలుగేళ్లయింది. ఆమె ఎంతో విచారంగా ఉంటున్నారు. నిన్ను చూస్తే ఆమె తప్పక నవ్వుతుంది,'' అన్నది. ఆమె బ్రహ్మచారిణిని ఉద్యానవనంలో ఉన్న యువరాణి వద్దకు తీసుకుపోయింది.

ఒక తిన్నెమీద విచారంగా కూర్చుని ఉన్నది యువరాణి. భూతకిలా ఉన్న బ్రహ్మచారిణి ఒయ్యారంగా నడుస్తూ వస్తూ ఉండటం చూడగానే ఆమె గలగలా నవ్వేసింది.

''ఇంతకాలానికి నన్ను మళ్ళీ నవ్వించగలిగావు. నీలో ఏం మహత్తు ఉన్నది?" అని యువరాణి బ్రహ్మచారిణిని అడిగింది.

''మహత్తు నాది కాదు, తాయత్తుది," అన్నది బ్రహ్మచారిణి.

''ఏదీ? ఆ తాయత్తు ఒక్కసారి చూస్తాను. ఇలా ఇయ్యి,'' అని యువరాణి అడిగింది.

''కట్టుకుని మరీ చూడండి,'' అంటూ బ్రహ్మచారిణి తన తాయిత్తు తీసి యువరాణి జబ్బుకు కట్టి, ''మరొకరి జబ్బకు కట్టినప్పుడే ఇది మిమ్మల్ని వదులుతుంది,'' అని చెప్పేసి, వేగంగా తన ఇంటికి వెళ్ళిపోయింది.



బ్రహ్మచారిణి కదలగానే యువరాణి పల్లకి ఎక్కి, రాజభవనానికి బయలు దేరింది. కొద్దిదూరం పోయేసరికే బోయీలకు పల్లకి బరువు మోయరానంత అయిపోయి నట్టనిపించింది. ఇదే సమయంలో పల్లకీలో నుంచి యువరాణి పెద్దగా ఆర్తనాదం చేసింది. ఈ కంగారులో బోయీలు పల్లకీని కింద పడేశారు. పల్లకి విరిగిపోయింది. యువరాణి భూతకిలా లేచింది. పరిచారికలు ఆమెను అతి కష్టం మీద అంతఃపురానికి నడిపించుకుంటూ పోయారు. తన తండ్రిని చూడగానే యువరాణి బావురుమని ఏడుస్తూ, జరిగిన సంగతి చెప్పింది.

ఒక్కగా నొక్క కూతురు పరిస్థితి చూడలేక రాజు తాయత్తును తెంపి దూరంగా పారేశాడు. కాని మరుక్షణమే అది వచ్చి యువరాణి జబ్బకు కరుచుకుని, నిప్పులా కాల్చసాగింది. ఆమె పడేబాధ సహించలేక, రాజు ఆ తాయత్తును తానే కట్టుకున్నాడు. యువరాణి ఎప్పటిలా నాజూకుగా తయారయింది గాని, రాజు స్థూలకాయు డైపోయాడు. రాజుగారు కనక తిండి సమస్య లేదుగాని, దుస్తులూ, సింహాసనమూ, కిరీటమూ, ప్రతిష్ఠా సమస్యలై కూర్చున్నాయి.

మర్నాడు ఆయన బ్రహ్మచారిణిని ప్రశ్నించి, తాయత్తును ఆమెకిచ్చిన వెంకయ్యను అడిగి, అతనికిచ్చిన మరిడయ్యను ఆరాతీయించి, మరిడయ్యకు తాయత్తు అంటగట్టిన వాణ్ణి గురించి తెలుసుకోలేక పోయాడు. చివరకు ఆయన నిండు సభలో తాయత్తు గురించి చెప్పి తన తాయత్తు కట్టించుకున్న వాడికి తిండి వగైరా ఏర్పాట్లు చేస్తానన్నాడు.

అప్పుడు ఒక మనిషి తాయత్తు కట్టించుకు నేటందుకు ముందుకు వచ్చాడు. వాడే మరిడయ్యకు తాయత్తు అంటగట్టినవాడు. వాడు మళ్ళీ స్థూల శరీరం తెచ్చుకుని, హాయిగా రాజమందిరంలో తింటూ, యువరాణిని వినోద పరుస్తూ జీవించాడు.





# మాయదారి పాలవాడు

పన్నా అనే గ్రామంలో రామ్నా అనే మాయదారి పాలవాడు ఉండేవాడు. వాడి భార్యకూడా మాయదారిదే. వాళ్ళు తమ పాలలో చవుక పదార్థాలు చేర్చి కల్తీ చేసి అమ్మేవాళ్ళు. వాళ్ళకు బోలెడన్ని ఆవులూ, గేదెలూ ఉండేవి. అవి బోలెడన్ని పాలు ఇచ్చేవి. కాని వాళ్ళు దురాశకొద్దీ తమ కల్తీపాలు గ్రామస్థులకు చవుకగా అమ్మి బోలెడంత డబ్బు సంపాదించే వాళ్ళు.

ఆ గ్రామంలోనే నీలు అనే పాలవాడు కూడా ఉండే వాడు. వాడు నీతిపరుడు. వాడికి రెండు ఆవులూ, రెండు గేదెలూ మాత్రమే ఉండి, కొద్ది పాలు ఇచ్చేవి. ఆ పాల మీదనే ఆధారపడి వాడూ, వాడి భార్యా, కొడుకూ బతికేవారు. వాడి మిత్రులు వాణ్ణి పాలలో నీరు కలపమనీ, ఇతరత్రా కల్తీచేసి పాలు జాస్తిగా ఉండేట్టు చూడమనీ పురికొల్పారు గాని, వాడు వాళ్ళ మాట వినలేదు. న్యాయంగా ఉండటమే సరి అయిన మార్గమని వాడి నమ్మకం. వాడి పాలు శుద్ధమైనవి. అందుచేత వాడు వాటిని రామ్నా అమ్మే ధరకు అమ్మలేక పోయేవాడు. దాని ఫలితంగా వాడికి రెండు పూటలా తినటమే గగనంగా ఉండేది. చాలాసార్లు వాడి కుటుంబమంతా ఉపవాసాలు చేశారు. కాని వాడు తన ఆవులనూ, గేదెలనూ మేపటంలో ఏ మాత్రమూ అశ్రద్ధ చేసేవాడు కాడు.

రామ్నా ధనదాహం అంతులేనిది. వాడు డబ్బుతో బంగారం కొనేవాడు గాని, తన ఆవులకూ, గేదెలకూ సరిగా మేత పెట్టేవాడు కాడు. అందుచేత వాడి ఆవులూ, గేదెలూ నానాటికీ చిక్కిపో సాగాయి. వాటి పాలు కూడా తగ్గి

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



పోయాయి. అయినా రామ్నా, వాడి భార్యా ఆ తరిగిపోయిన పాలలో మైదా పిండీ, నీళ్ళో కలిపి, పాలు తరగకుండా చూశారు. ఆ కల్తీపాలకు రుచి ఉండ గలందులకు వాళ్ళు చక్కెర కొద్దిగా చేర్చారు. ఆ విధంగా వాళ్ళ వాడుక లకు పాలు అందుతూ వచ్చాయి.

అయినా రామ్నా ఇచ్చే పాల రుచిలో మార్పు కనబడింది. వాడుకల వాళ్ళు సాధించ సాగారు. రామ్నా తడువుకో కుండా సాకు చెప్పాడు.

''బాబులారా, నా ఆవులూ, గేదెలూ మేసే మేత మారింది. అవి ఇప్పుడు పచ్చిగడ్డికి బదులు ఎండు గడ్డి తింటు న్నాయి. అందు చేత పాలరుచిలో తేడా వస్తున్నది. అయ్యలారా, ఎండు గడ్డి తినే జంతువుల పాలు ఒంటికి మంచి వనేది మరవకండి. అవి శ్రేష్ఠమైన పాలు. కావలిస్తే ఏ ఆయుర్వేద వైద్యుణ్ణ యినా అడగండి,'' అని తన వాడుకల వాళ్ళకు చెప్పి, రామ్నా ఆ గ్రామంలో ఉండే ఆయుర్వేద వైద్యుణ్ణి, తంతు శర్మవైద్య అనే వాడికి లంచం పెట్టి, తన మాట నిజమని చెప్పించాడు.

''అవును, ఎండు గడ్డి తినే పశువుల పాలు ఆయువు వృద్ధి చేస్తాయని మన ఆయుర్వేదంలో చెప్పి ఉన్నది,'' అన్నాడు తంతు శర్మవైద్య.

ఈ విధంగా రామ్నా వ్యాపారం అభి వృద్ధి చెందుతూంటే, పాపం, నీలు ఎంత నిజాయితీ పరుడై కూడా బాధలతో సత మతం కాసాగాడు.

గ్రామానికి తూర్పు భాగంలో చౌధురీల కుటుంబం ఒకటి ఉన్నది. వాళ్ళు మధ్య తరగతి వాళ్ళు. వాళ్ళ బంధు వులు కొందరు పట్టణంలో ఉంటున్నారు. ఏదో పెళ్ళి సందర్భంలో ఎక్కడెక్కడి బంధు బలగమంతా చౌధురీల ఇంటికి వచ్చింది. చౌధురీ సోదరులలో ఆఖరు వాడైన దీను చౌధురీ కొడుకులు రవీ, ఛవీ అనే వాళ్ళిద్దరూ చాలా తెలివైన

వాళ్ళు. పెద్దవాడైన రవి; పద్దెనిమిది ఎళ్ళవాడు. ఇంద్రజాల విద్యలో అరి తేరుతున్నాడు.

తొలిసారిగా గ్రామ జీవితం చూస్తున్న అన్నదమ్ములు అమిత ఉత్సాహంతో గ్రామం అన్నిమూలలూ పరిశీలించారు. కుమ్మరి సారే, నేతమగ్గమూ, నూనె గానుగా—ప్రతిదీ వాళ్ళకు వింతగానే ఉన్నది.

బంధువుల తాకిడి మూలాన అదనంగా పాలు కావలిసి వస్తే రామ్నా అదనపు పాలు చౌధురీలకు సరఫరా చేశాడు. అన్నదమ్ము లిద్దరూ ఉదయం పూట పాలు తాగుతారు. కాని వాళ్లు పట్టణంలో కల్తీపాలే తాగుతారు గనక, రామ్నా పాలలో కల్తీ వాళ్ళకు తెలియలేదు.

ఒకరోజు వాళ్ళు గ్రామం చుట్ట బెట్టుతూ, ఒక బీడులో పశువులను మేపు కుంటున్న అభాగ్యుడు నీలును చూశారు. పశువులు తమ దారిన తాము మేస్తూ ఉంటె నీలు పిల్లనగ్రోవి వాయిస్తున్నాడు. అతను మంచి మురళీవాద్యగాడు. అతని సంగీతం ఆ అన్నదమ్ములను ఆకర్షిం చింది. వాళ్ళు అతని దగ్గిరికి పోయి, గానం విని ఆనందించారు.

నీలు వాయించటం ఆపగానే రవి అతన్ని, "అన్నా, నువు ఇంత కమ్మని



గానం ఎలా సృష్టించ గలుగుతున్నావు?" అని అడిగాడు.

"నేను సృష్టించటం లేదు, చిన్ని బాబూ, నా విచారమే ఈ పాటను సృష్టి స్తున్నది." అని నీలు జవాబిచ్చాడు.

"విచారమా? ఏం విచారం?" అని రవి అడిగాడు.

"ఒక విచారమా? నాకు తిండి లేదు, బట్టలేదు. మా కుటుంబమంతా పస్తులుంటున్నాం," అన్నాడు నీలు.

ఈ మాట విని రవి చలించి, నీలు కథ అంతా వినగోరాడు. నీలు తన దుస్థితిని గురించీ, రామ్నా చేసే మోసం గురించీ చెప్పేశాడు.



"ఇదంతా గ్రామస్థులకు చెప్పెయ్యరాదూ?" అని రవి అడిగాడు.

"నా మాట ఎవరు నమ్ముతారు? గ్రామ వైద్యుడు తంతు శర్మవైద్య రామ్మూను వీలుగా మాట్లాడతాడు. గ్రామస్థులకు ఆయన మాట అంటే గొప్ప గురి," అన్నాడు నీలు దైన్యంతో.

"ఎందుచేత, అన్నా? తంతు శర్మ వైద్య భూతవైద్యమూ, మంత్ర తంత్రాలూ నేర్చినవాడా ఏం? అప్పుడప్పుడూ అద్భుతాలు చూపిస్తాడా?" అని రవి అడిగాడు.

"సరిగా కనిపెట్టావు. తంతు శర్మ మందులూ, మాకులూ ఇయ్యటమే గాక, రోగుల మీద తాయెత్తులూ, తంత్ర చికిత్సలూ ప్రయోగం చేస్తాడు. వాళ్ళ ఇంటి ఆవరణలో పడమరగా ఉన్న మర్రి చెట్టు మీద ఆయన మచ్చిక చేసిన భూతాల జంట ఉన్నదని గ్రామస్థులు నమ్ముతారు," అన్నాడు నీలు.

"నీ పాలు ఒక గ్లాసుడు ఇయ్యగలవా?" అని రవి అడిగాడు.

ఆ రోజు అన్నదమ్ము లిద్దరూ నీలు వద్ద నుంచి ఒక లోటాడు పాలు తీసుకుపోయి, కాచి తాగారు. దాని రుచే వేరుగా ఉన్నది.

"ఇందులో ఏదో కిటుకు ఉన్నది. దాన్ని మనం బట్టబయలు చేసి, దొంగను పట్టాలి," అన్నాడు రవి.

"ఎలా?" అని ఛబీ అడిగాడు.

రవి కొంచెం సేపు ఆలోచించి, "దొరికింది, ఛబీ! ఇంద్రజాలంతో పని జరుగుతుంది," అన్నాడు.

గ్రామస్థుల వినోదం కోసం రవి ఇంద్రజాల ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేసి, దానికి ముఖ్య అతిథిగా తంతు శర్మను ఆహ్వానించాడు.

"బాబయ్యగారూ, తమరు సకల విద్యలలోనూ సిద్ధహస్తులు. మేము కుర్రవాళ్ళం. మీరు వస్తే మాకు ఎంతో ప్రోత్సాహంగా ఉంటుంది," అని రవి

ఆయనను తెగపొగిడాడు. తంతుశర్మ ఈ పొగడ్తతో ఉబ్బిపోయి, వచ్చి ముందు వరసలో కూర్చున్నాడు.

ఇంద్రజాల ప్రదర్శనలో చిట్ట చివర పాలతో ఒక అంశం ఉంటుందని రవి ముందే ప్రేక్షకులకు తెలిపి, రామన్న చేతా, నీలు చేతా ఒక్కొక్క గ్లాసులో పాలు తెప్పించి, ఏ గ్లాసు ఎవరిదైనదీ గుర్తు తగిలించి, అందరికీ కనిపించే టట్టుగా ఒక బల్ల మీద ఉంచాడు.

తరవాత రవి ప్రదర్శన ప్రారంభిం చాడు. అతను అనేక అద్భుత ప్రయో గాలు చేసి ప్రేక్షకులను ఆశ్చర్యపరి చాడు. రవికి అతీత శక్తులున్నాయని గ్రామస్థులు విధిగా నమ్మవలసి వచ్చింది. దయ్యాలనూ, భూతాలనూ వశీకరించు కోవటంలో అతను తంతుశర్మకు ఏ మాత్రమూ తీసిపోనట్టు కనిపించాడు. ఈ భావం గ్రామస్థులలో బాగా నాటుకునే టట్టు చేసి, రవి దొంగను బయట పెట్ట టానికి ఉపక్రమించాడు.

అతను గ్రామస్థులతో, "నా అధీనంలో గల భూతాలు శ్రమించటం చేత దప్పి గొని ఉన్నాయి. మనుషుల లాగే వాటికి కూడా కాఫీ అంటే ఇష్టం. వాటి కోసం ఇప్పుడు కాఫీ తయారు చేస్తాను. సోదర సోదరీ మణులారా, మనుషులమైన



మనం కల్తీలేని పదార్థాలే తినటానికీ, తాగటానికి ప్రయత్నిస్తాం. భూతాలు కూడా అంతే. వాటికి కల్తీ ఆహారంగాని, కల్తీ పానీయం గాని ఇచ్చామంటే అవి అల్లరి పెట్టేస్తాయి. కల్తీ కని పెట్టటంలో అవి మన కన్న చాలా సమర్థత గలవి. ఈ సంగతి ఇప్పుడే మీకు చూపిస్తాను," అన్నాడు.

ఇలా అంటూ రవి రెండు బల్లల మీద రెండు ఖాళీ గ్లాసులు పెట్టాడు; ఒక పాత్రలో ఉన్న కాఫీ డికాక్షను కొంచెం కొంచెంగా రెండు గ్లాసులలోనూ పోశాడు; తరవాత నీలు ఇచ్చిన పాలు ఒక గ్లాసులో పోసేసరికి చక్కని కాఫీ రంగులో కాఫీ

తయారయింది. అలాగే రవి రామ్నా ఇచ్చిన పాలు రెండో గ్లాసులో పోసేసరికి రెండో గ్లాసులోని ద్రావకమంతా నల్ల సిరా లాగా మారింది!

"సోదర సోదరీమణులారా, రామ్నా కల్తీపాలను భూతాలు కూడా స్వీక రించటం లేదు. మనుషులై ఉండి మీరు ఆ పాలను తాగటం ఎంత ఘోరం!" అన్నాడు రవి.

రవి చేసిన ఇంద్రజాలం గ్రామస్థుల మీద ఎంత బాగా పారిందంటే, వాళ్ళు అతని మాటలు పూర్తిగా విశ్వసించి, రామ్నాను తిట్టసాగారు. తరవాత రామ్నా చేస్తున్న మోసమంతా బట్టబయలై, అతని ఆట కట్టింది. సోదా చెయ్యగా అతని ఇంట మైదాపిండి బస్తాలు దొరికాయి. గ్రామస్థులు రామ్నాను గ్రామం నుంచి వెళ్ళగొట్టి, అతని పశువులన్నిటినీ నీలుకు ఇచ్చారు. తంతుశర్మ తన తప్పు ఒప్పు కున్నాడు. ఆయన గ్రామస్థులకు క్షమా పణ చెప్పుకుని, జరిమానా ఇచ్చుకున్న మీదటనే ఆయనను గ్రామంలో ఉండ నిచ్చారు.

పట్టణానికి తిరిగి వెళ్ళిన అనంతరం రవీ, ఛవీ తమ మిత్రులకు ఈ విషయ మంతా చెబితే, వాళ్ళు రవిని, "పాలను సిరా లాగా ఎలా మార్చావు?" అన్నారు.

"టించర్ అయొడీన్!" అన్నాడు రవి.

"అంటే, గాయాలకు వేసేదేనా?" అని మిత్రులు రవిని అడిగారు.

"అవును. దాన్ని నీటిలో కలిపి, కాఫీ డికాక్షన్ రంగులో తయారు చేశాను. మిగిలిన ఇంద్రజాల మంతా రసాయన ప్రయోగమే. అయొడీన్ పిండి పదార్థానికి తగలగానే నల్లగా అవుతుంది. రామ్నా గాడి పాలలో పిండి పదార్థం చాలా ఉన్న దని నాకు తెలుసు. పిండి కల్తీ ఉండటం చేతనే వాడి పాలు నల్లగా మారాయి. నీలు పాలు శుద్ధమైనవి. అందుచేత అవి నలుపెక్క లేదు," అన్నాడు రవి.

"భేష్, రవీ! భేష్!" అన్నారు అతని మిత్రులు.



# బద్ధకస్తుడు

వెనకటికి ఓ రాజుగారికి ఆలస్యంగా నిద్రలేచే చెడ్డ అలవాటు ఉండేది. రోజూ ఆయన నిద్రలేచి, కాలకృత్యాలు ముగించుకుని, సభికులకు దర్శనమిచ్చేసరికి భోజనాలవేళ అయ్యేది. ఈ అలవాటు అటు రాజుగారికీ, ఇటు సభికులకూ ఇబ్బందిగానే ఉంది. రాజుగారు ఈ అలవాటు మానుకోవాలని మంత్రిని సలహా అడిగాడు.

"మహారాజా! రోజూ తెల్లవారు ఝామున శ్రావ్యమైన సంగీతం వినిపించి, మిమ్మల్ని మేల్కొల్పటానికి కొంతమంది మేళగాళ్ళను నియమించుకుంటే మంచిది," అని మంత్రి సలహా ఇచ్చాడు.

రాజుగారు ఆ రోజే కొంతమంది మేళగాళ్ళను నియమించాడు. ఆ తెల్లవారు ఝామున మేళగాళ్ళు చక్కటి సంగీతం పాడసాగారు. రాజుగారికి నిద్రా భంగం అయింది. బంగారం వంటి నిద్ర చెదిరిపోయినందుకు విపరీతమైన కోపం వచ్చింది. వెంటనే తన సేవకుల్ని పిలిచి, ఆ మేళగాళ్ళను ఒక్కొక్కడిని నాలుగేసి కొరడా దెబ్బలు కొట్టి తరిమివెయ్యమని ఆజ్ఞాపించి, మరలా నిద్రలోకి జారుకున్నాడు.

మర్నాడు, ఎలాగైనా సరే తప్పకుండా తెల్లవారుఝామున నిద్రలేవాలని నిశ్చయించుకున్నాడు రాజు. తెల్లవారుఝామున మేళగాళ్ళు వచ్చారుగాని, గొంతెత్తితే కొరడా దెబ్బలు తినవల్సి వస్తుందని మెదలకుండా తిరిగి వెళ్ళిపోయారు. రాజుగారు యథాప్రకారం ఆలస్యంగానే నిద్రలేచాడు. ఆయనకి మేళగాళ్ళు ఆ రోజు తనను నిద్రలేప లేదని గుర్తొచ్చింది. వెంటనే మేళగాళ్ళని పిలిపించి, వాళ్ళకు అప్పజెప్పిన పని సక్రమంగా నిర్వహించ నందుకుగాను, ఒక్కొక్కడికి నాలుగేసి కొరడాదెబ్బలు శిక్ష విధించాడు. —కె. నాగేశ్వరరావు





# మాట్లాడే దూడ

ఒక గ్రామంలో వెంకయ్య అనే రైతు దగ్గిర ఒక ఆవుదూడ ఉండేది. పెళ్ళి పెటాకులూ లేని వెంకయ్య ఆ దూడను ప్రాణంకన్న ఎక్కువగా చూసుకునే వాడు. ఆ దూడను అంత అందంగా సృష్టించిన దేవుడు దానికి మాట్లాడే శక్తి కూడా ఇచ్చి ఉంటే ఎంత బాగుండేది అనుకునే వాడు వెంకయ్య.

రాను రాను ఈ ఆలోచన ఒక మనో వ్యాధిగా పరిణమించి, "దూడ మాట్లాడే టట్టు చెయ్యటానికి మార్గ మేమీ ఉండదా?" అని ఎరిగిన వారి నందరినీ అడగసాగాడు వెంకయ్య.

"దూడ మాట్లాడట మేమిటి? నీకే మైనా మతిపోయిందా?" అని అందరూ అతన్ని మందలించారు.

అయినా వెంకయ్య బుద్ధి మారలేదు. సాధుల దగ్గిరా, యోగుల దగ్గిరా గొప్ప మహిమ లుంటాయని అతడు విన్నాడు. హిమాలయాలలో తిరిగి ఏ సాధువు నన్నా అడిగితే తన దూడ చేత మాట్లాడించ లేక పోడని వెంకయ్యకు ఆశ పుట్టింది. అతను తన దూడను పోషించే భారం నమ్మకస్తుడైన జీతగాడికి అప్పగించి, తాను హిమాలయాలకు వెళ్ళాడు. అక్కడ కనిపించిన ప్రతి బైరాగి వాడికి తన కోరిక చెప్పాడు, కాని ప్రయోజనం లేక పోయింది.

చిట్ట చివరకు అతని పుణ్యం పండి ఒక సాధువు అతనికి ఒక మూలిక ఇచ్చి, దాన్ని దూడ చేత తినిపించి నట్టయితే అది మాట్లాడు తుందని చెప్పాడు.

వెంకయ్య సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చాడు. దూడ వెంకయ్యను చూడ గానే జాలిగానూ, సంతోషంగానూ అరిచింది.

బద్దిగం పాండురంగారెడ్డి

"ఇన్నాళ్ళూ నేను కనిపించ లేదని అది ఎంత బాధపడిందో కదా!" అనుకుని వెంకయ్య దూడ చేత మూలిక తినిపిస్తూ, "ఇక నీకు మాటలు వస్తాయిలే. నీ మనసులో ఉన్నదంతా చెప్పగలుగుతావు," అన్నాడు.

దూడ మూలిక తినటం పూర్తి చేసి, "ఇన్నాళ్ళూ ఎక్కడికి వెళ్ళారు? మీరేమైపోయారో అని నేనెంతగా బాధపడ్డానో!" అన్నది.

వెంకయ్య ఉబ్బిపోయి, దూడకు తాను పడిన పాట్లన్నీ చెప్పాడు. తరవాత అతను దూడతో, "ఎండలో తిరగక, హాయిగా పాకలోకి వెళ్ళి పడుకో," అన్నాడు.

"మీకేం మీరు హాయిగా పరుపుల మీద పడుకుంటారు. ఆ ఎండు గడ్డి మీద పడుకుంటే తెగ గుచ్చుకుంటున్నది. మీ పరుపు ఒకటి కాస్త ఆ పాకలో వేయించారంటే హాయిగా పడుకుంటాను," అన్నది దూడ.

"ఓసి, ఎన్ని మాటలు నేర్చావే! ఈ సంగతి ఊళ్ళో వాళ్ళకు తెలిస్తే దిష్టి తగులుతుంది. పద పద!" అంటూ వెంకయ్య దూడను కట్టేశాడు.

తరవాత వెంకయ్య భోజనం చేస్తూండగా, "ఏమండోయ్, వెంకయ్యగారూ!" అని దూడ కేకపెట్టింది.

"ఏమిటే?" అంటూ వెంకయ్య దూడ దగ్గిరికి లేచి వచ్చాడు.



"ఏమయ్యా, పెద్దమనిషీ! నువ్వొక్కడివే భోజనం చేసేవాడివా? మేమంతా మట్టి కొట్టుకు పోవలిసిందేనా? ఇంత కుడితీ, తెలక పిండీ పట్టుకురా!" అన్నది దూడ.

వెంకయ్య మారుమాట్లాడకుండా అది చెప్పిన పని చేశాడు.

"ఇదేమిటయ్యా, కుడితిలో ఇన్ని నీళ్ళు పోశావు? అందులో వట్టి చిట్టే పోశావేం? కాస్త దోసా, బీరా, సొరా ముక్కలు తరిగి వెయ్యి. తినేది కాస్త రుచిగా ఉండవద్దూ?" అని దూడ వెంకయ్యను దులపరించింది.

వెంకయ్య తెల్లబోయి, చచ్చినట్టు అది చెప్పిన పనులన్నీ చేశాడు.

ఈ విధంగా ఆ దూడ ప్రతిదానికీ వెంకయ్యను సాధించి వేపుకు తిన సాగింది.

ఒక రాత్రి వెంకయ్య మామూలుగా నిద్రపోతూ ఉండగా, "ఏమయ్యోయ్, వెంకయ్యగారూ! ఇటుకాస్త రండి. దోమలు చంపేస్తున్నాయి," అని దూడ కేకపెట్టింది.

నిద్రాభంగమయినందుకు మండి పడుతూ వెంకయ్య లేచి వచ్చి, దూడను కర్రతో కొట్టసాగాడు.

ఆ దెబ్బలు పడలేక దూడ, "రామయ్యగారూ! సీనయ్యగారూ! పుల్లయ్యగారూ! రక్షించండి, బాబూ! చంపేస్తున్నాడు!" అని అరిచింది.

వెంకయ్యను దొంగ ఎవరో కొట్టుతున్నాడనుకుని, ఇరుగు పొరుగు వాళ్ళు వచ్చి, చీకట్లో వెంకయ్యనే దొంగ అనుకుని, తల పగిలేటట్టు కొట్టారు.

"చచ్చానురో, బాబో!" అని వెంకయ్య గిలగిలా తన్నుకున్నాడు.

"చచ్చావా? చావు!" అన్నది దూడ కసిగా.

జరిగినది తెలుసుకుని, కొట్టిన వాళ్ళే వెంకయ్య దెబ్బలకు కట్లుకట్టారు.

కాస్త కోలుకోగానే వెంకయ్య మళ్ళీ హిమాలయాలకు పరిగెత్తాడు.






ధర్మరాజు రాజ్యాభిషిక్తుడైన తరవాత కృష్ణుడు చాలాకాలం హస్తినాపురంలో ఉండి, తన తండ్రి అయిన వసుదేవుణ్ణి చూడాలనిపించి, సాత్యకినీ, సుభద్రనూ వెంట బెట్టుకుని ద్వారకకు తిరిగి వచ్చాడు.

వసుదేవుడు కృష్ణుడి ద్వారా యుద్ధ వార్తలన్నీ తెలుసుకుని, తన మనమడైన అభిమన్యుడి చావు విని చాలా బాధపడ్డాడు.

ఈ లోపల, ధర్మరాజు అశ్వమేధానికి అవసరమైన ధనాన్ని హిమవత్పర్వతం నుంచి తీసుకు రావటానికి సంకల్పించాడు. పాండవులు సేనలను కూర్చుకుని, ధృతరాష్ట్రుడి వద్దా, కుంతీ గాంధారీల వద్దా అనుమతి తీసుకుని, హిమవత్పర్వతానికి బయలుదేరారు. వాళ్ళు నదులూ, అరణ్యాలూ, పర్వతాలూ దాటి హిమాలయం చేరి, మరుత్తుడి ధనం దాచి ఉంచిన చోట విడిశారు. వాళ్ళు ఒక రాత్రి అంతా ఉపవాసమూ, జాగరమూ చేస్తూ దర్భచాపల మీద కూర్చుని ఉండి, మర్నాడు శివుడికీ, కుబేరుడికీ, మణిభద్రుడికీ అర్చనలు చేసి, భూతబలులు ఇచ్చి, నిధిని తవ్వారు. అందులో అనేకమైన చెంబులూ, గిన్నెలూ, బిందెలూ, మూకుళ్ళూ, పళ్ళేలూ ఉన్నాయి. అన్నీ బంగారంతో చేసినవి. వాటిని తీసుకుపోవటానికి అంతులేని ఒంటెలూ, గుర్రాలూ, వాహనాలూ, మనుషులూ అవసరమయింది. వాటితో పాండవులు హస్తినాపురానికి తిరిగి వచ్చారు.

**62: అశ్వమేధ యాగం**



అశ్వమేధానికి ప్రయత్నాలు ప్రారంభ మయినట్టు తెలిసి కృష్ణుడు, ప్రద్యుమ్నుణ్ణీ, సాత్యకి మొదలైన వారినీ వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలు దేరాడు. అతనితోబాటు సాంబుడూ, చారుధేష్ణుడూ, గదుడూ, కృతవర్మా, సుభద్రతో సహా బలరాముడూ కూడా బయలుదేరారు.

ధృతరాష్ట్రుడు విదురుడితో సహా ఎదురు వచ్చి, వారికి స్వాగతం చెప్పి, ఆహ్వానించాడు. కృష్ణుడు యుయుత్సుడి ఇంట బస చేశాడు.

ఈ సమయంలోనే ఉత్తర ప్రసవించింది. పుట్టిన పిల్లవాడు ఏడవలేదు, శవం లాగా ఉన్నాడు. అందరి సంతోషమూ అంతలోనే చల్లారి పోయింది. కృష్ణుణ్ణి పిలుచుకు రావటానికి కుంతి బయలుదేరేసరికి, సాత్యకితో సహా కృష్ణుడే వచ్చాడు. సుభద్రా, ద్రౌపదీ మొదలైన స్త్రీలు ఏడుస్తున్నారు.

కుంతి కృష్ణుణ్ణి చూసి గద్గద కంఠంతో, "కృష్ణా, నువే కాపాడాలి. ఆ అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం మూలాన నీ మేనల్లుడి కొడుకు చచ్చి పుట్టాడు! వీణ్ణి బతికించు," అన్నది.

అదే విధంగా సుభద్రా, ఉత్తరా, ద్రౌపదీ కృష్ణుణ్ణి వేడుకున్నారు. ఉత్తర బొత్తిగా పిచ్చిపట్టిన దానిలాగా అయిపోయి, మూర్ఛపోయింది.

కృష్ణుడు తన పాదంతో ఆ పిల్లవాణ్ణి నిలువునా నిమిరాడు. అప్పుడా పిల్లవాడిలో చైతన్యం వచ్చింది. వెంటనే అందరికీ ఆనందం కలిగింది. బ్రాహ్మణులు బిడ్డను ఆశీర్వదించారు. పాండవ వంశం పరిక్షీణం కాకుండా కలిగాడు గనక ఆ పిల్లవాడికి పరీక్షిత్తు అని కృష్ణుడు పేరు పెట్టాడు. ఆ పిల్లవాడు దిన దిన ప్రవర్ధమానుడు కాసాగాడు.

పరీక్షిత్తుకు నెల నిండే సరికి పాండవులు ధనంతో తిరిగి వచ్చారు. వారు వస్తున్నారని తెలియగానే హస్తినాపురాన్ని

చక్కగా అలంకరించారు. యాదవులు పాండవులకు ఎదురు వెళ్ళారు. ఎక్కడ చూసినా నృత్యాలూ, గానాలూ జరుగుతూండగా పాండవులు హస్తినాపురం ప్రవేశించారు. వాళ్ళు తమకు మనమడు కలిగాడనీ, చచ్చి పుట్టిన ఆ శిశువును కృష్ణుడు బతికించాడనీ విని, కృష్ణుణ్ణి అభినందించారు.

తరవాత ధర్మరాజు, వ్యాసుడి అనుమతీ, కృష్ణుడి అనుమతీ పొంది, అశ్వమేధ యాగం చెయ్యటానికి ఉపక్రమించి, చైత్రపౌర్ణమి నాడు యజ్ఞదీక్ష పూనాడు. యాగాశ్వాన్ని అశ్వలక్షణాలు తెలిసిన సూతులూ, బ్రాహ్మణులూ ఎన్నిక చెయ్యాలి. తరవాత దాన్ని దేశాల మీద వదలాలి. అది ప్రపంచమంతా తిరిగి రావాలి.

అశ్వమేధయాగం జరిగేకాలంలో ధర్మరాజు దీక్షలో ఉంటాడు గనక, భీముడు నకులుడి సహాయంతో రాజ్యం చూడటానికీ, అర్జునుడు యాగాశ్వం వెంట వెళ్ళి, దానికి రక్షకుడుగా ఉండటానికీ, సహదేవుడు కుటుంబ విషయాలు చూడటానికీ ఏర్పాటయింది.

అశ్వరక్షకుడుగా పోబోతున్న అర్జునుడితో ధర్మరాజు, "అర్జునా, గుర్రాన్ని రక్షిస్తూ దాని వెంట వెళ్ళేటప్పుడు ఏ క్షత్రియులైనా నిన్ను ఎదిరిస్తే వారితో వైరం రాకుండా మసులుకోవాలి. మనం చేయనున్న ఈ యాగానికి





వాళ్ళనందరినీ 'ఆహ్వానించు.'' అని చెప్పాడు.

ధర్మరాజు యజ్ఞదీక్ష వహించి స్వయంగా విడిచిన గుర్రం వెనకగా గాండీవం ధరించి అర్జునుడు బయలుదేరితే పురజనులు గుంపులు గుంపులుగా చూసి, ఆనందించారు. అర్జునుడి వెంట అశ్వపోషణ బాగా ఎరిగినవాడు, యజ్ఞవల్క్యుడి శిష్యుడు ఒకడూ, వేదపారగులైన కొందరు బ్రాహ్మణులూ, కొందరు క్షత్రియులూ కూడా బయలుదేరారు. యుద్ధంలో పాండవులు జయించిన భూమి అంతటా ఆ అశ్వం సంచారం చేసింది.

ఎవరితోనూ యుద్ధం చెయ్యవద్దని ధర్మరాజు చెప్పినప్పటికీ అర్జునుడు దారిలో అనేక యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. అతన్ని అనేక చోట్ల కిరాతులూ, యవనులూ ఎదుర్కొన్నారు. అనేక మంది ఆర్యక్షత్రియులు కూడా అతన్ని ప్రతిఘటించారు. అన్ని యుద్ధాలలోనూ అర్జునుడు గెలిచాడు.

భారతయుద్ధంలో అర్జునుడి చేత చచ్చిన త్రిగర్తుల కొడుకులూ, మనమలూ అర్జునుడు యాగాశ్వం వెంట రక్షకుడుగా వస్తున్నట్టు విని, స్పర్ధతో యుద్ధసన్నద్ధులై వచ్చి, అశ్వాన్ని పట్టుకోవటానికి వచ్చారు.

అర్జునుడు వాళ్ళతో మంచిగా మాట్లాడబోతే వాళ్ళు అతన్ని తమ బాణాలతో కొట్టారు. త్రిగర్తుల నాయకుడైన సూర్యవర్మతో అర్జునుడు యుద్ధం చెయ్యవలిసి వచ్చింది. అతను సూర్యవర్మనూ, కేతుధర్ముడు అనే వాణ్ణీ, ధృతవర్మ అనే వాణ్ణీ, ఇంకా పద్దెనిమిది మంది త్రిగర్తులనూ చంపిన మీదట మిగిలిన వాళ్ళు అతనికి లోబడ్డారు.

అలాగే ప్రాగ్జ్యోతిష పురంలో భగదత్తుడి కొడుకు వజ్రదత్తుడు అర్జునుడిపై యుద్ధం చేశాడు. అర్జునుడు అతన్ని ఓడించి కూడా, చంపక విడిచిపెట్టుతూ,

అతన్ని అశ్వమేధయాగానికి ఆహ్వానించాడు.

తరవాత అతనికి సైంధవులతో యుద్ధం జరిగింది. అర్జునుడు ఆ సైంధవులనందరినీ ఓడించాడు. భారతయుద్ధంలో అర్జునుడి చేత చచ్చిన సైంధవుడి భార్య దుశ్శల ధృతరాష్టుడి కూతురు. ఆమె కొడుకు సురథుడు అర్జునుడు గుర్రం వెంట వస్తున్నాడని వింటూనే భయంతో ప్రాణాలు విడిచాడు.

ఇప్పుడు దుశ్శల తన మనమణ్ణి, పసివాణ్ణి, ఒక రథంలో పెట్టి అర్జునుడి వద్దకు తెచ్చి, "వీడు కూడా నీ మనమడు పరీక్షిత్తులాటి వాడే. వీణ్ణి చూసి, ఈ సైంధవులందరినీ క్షమించు. వీడి తాత మీకు చాలా ద్రోహం చేశాడు, అది మరిచిపో," అన్నది.

అర్జునుడు తనకు చెల్లెలైన దుశ్శలను కౌగలించుకుని, ఆమెనూ, ఆమె మనమణ్ణీ ఇంటికి పంపేసి, తాను గుర్రంతో బాటు ముందుకు సాగాడు.

కాలక్రమాన అశ్వం మణిపురం చేరింది. అప్పుడు మణిపురాన్ని ఏలుతున్నవాడు బభ్రువాహనుడు. అతను అర్జునుడికీ, చిత్రాంగదకూ పుట్టినవాడు. తన తండ్రి తన దేశంలోకి వచ్చాడని విని బభ్రువాహనుడు కొంతమంది బ్రాహ్మణులను వెంట



బెట్టుకుని అర్జునుణ్ణి చూడటానికి వచ్చాడు.

అర్జునుడికి అతని ప్రవర్తన చూసి కోపం వచ్చి, "నువు క్షత్రియుడివి కావా? నేను చుట్టపు చూపుగా రాలేదు. అస్త్రాలు ధరించి యాగాశ్వాన్ని రక్షిస్తూ వచ్చాను. వీరుడవైతే అశ్వాన్ని పట్టి, నాతో యుద్ధం చెయ్యాలి గాని, తియ్యగా మాట్లాడటానికి వస్తావా?" అన్నాడు.

అప్పుడు ఉలూచి అక్కడికి వచ్చి, బభ్రువాహనుడితో, "నాయనా, నేను ఒక నాగస్త్రీని. నీకు తల్లిని. నీ తండ్రి యుద్ధ దుర్మదంతో ఉన్నాడు. యుద్ధం చేసి అతన్ని మెప్పించు," అన్నది.



బభ్రువాహనుడికి పౌరుషం వచ్చింది. అతను యుద్ధ వేషం ధరించి, రథం ఎక్కి అర్జునుడి పైకి యుద్ధానికి వచ్చాడు. మహా దారుణంగా యుద్ధం చేసి, ఇద్దరూ మూర్ఛపోయారు. చిత్రాంగద వచ్చి, తన భర్తా, కొడుకూ కూడా పడి పోవటం చూసి ఏడవసాగింది. కొంతసేప టికి బభ్రువాహనుడు తేరుకుని, అర్జునుడి కోసం ఏడుస్తున్న తన తల్లిని చూసి, తాను చేసిన పనికి పశ్చాత్తాప పడి, ప్రాయోపవేశం చేశాడు.

అప్పుడు ఉలూచి అతన్ని సమీపించి, ''పిచ్చివాడా, నీ తండ్రి నీ చేతిలో చచ్చా డనుకుంటున్నావా? అతన్ని ఎవరూ జయించలేరు. నేను నా మాయచేత నీకు అలాటి భ్రమ కలిగించాను. ఈ మణిని తీసుకుపోయి అతనికి తాకించు. అతను వెంటనే లేస్తాడు,'' అన్నది. బభ్రువాహ నుడు మణిని తగిలించగానే అర్జునుడు నిద్ర లేచినట్టు లేచి కూర్చున్నాడు.

అర్జునుడు బభ్రువాహనుణ్ణి కౌగలించు కుంటూ ఉలూచి, చిత్రాంగదలు అక్కడే ఉండటం చూసి చాలా ఆనందించాడు. అతను వాళ్ళను, ''ఈ యుద్ధరంగానికి మీరెందుకు వచ్చారు?'' అని అడిగాడు.

దానికి ఉలూచి, ''అర్జునా, నువు భీష్మణ్ణి అక్రమంగా చంపటం చేత నీకు పాపం చుట్టుకున్నది. అది పరిహారం కావటానికి నేను నిన్ను నీ కొడుకు చేత చంపించాను,'' అన్నది.

అర్జునుడు ఈ మాట విని సంతోషించి, బభ్రువాహనుణ్ణి అశ్వమేధయాగానికి ఆహ్వానించాడు. బభ్రువాహనుడు ఒక రాత్రి తనతో తన యింట అతిథిగా ఉండ మని అర్జునుణ్ణి ఆహ్వానించాడు. కాని అర్జునుడు తాను గుర్రం వెంట తిరగక తప్పదన్నాడు.

యాగాశ్వం సముద్రం దాకా వెళ్ళి, ఇంద్రప్రస్థానికి తిరిగి రాసాగింది. అది మగధ రాజధాని అయిన రాజగృహం చేరింది. అక్కడ రాజుగా ఉన్న మేఘ

సంధి అనేవాడు అర్జునుడి మీదికి యుద్ధానికి వచ్చి, యుద్ధం చేసి, అర్జునుడి చేతిలో ఓడిపోయాడు.

అర్జునుడు అతనితో, "చిన్నవాడివైనా చక్కగా యుద్ధం చేశావు. నిన్ను చంపటం నా కిష్టం లేదు. వచ్చే చైత్రపౌర్ణమికి మా అన్న ధర్మరాజు అశ్వమేధయాగం చేయబోతున్నాడు. దానికి నువు రావాలి," అన్నాడు.

ఈ విధంగా అర్జునుడు గుర్రం వెంబడి పోతూ మ్లేచ్ఛులతోనూ, ఏకలవ్యుడి నిషాదులతోనూ, శకుని కొడుకైన గాంధార రాజుతోనూ, ద్రావిడులతోనూ, ఆంధ్రులతోనూ, ఓఢ్రులతోనూ యుద్ధాలు చేసి అందరినీ గెలిచి, హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

చైత్రపౌర్ణమి తిరిగి రాబోతున్నది. ఒక మాసం ముందు నుంచీ యాగప్రయత్నాలు జరిగాయి.

యాగానికి అంతులేని జనం వచ్చారు. వారిలో అనేక మంది వేదవేత్తలూ, రాజులూ ఉన్నారు. కృష్ణ బలరాములు తమ వెంట సాత్యకినీ, ప్రద్యుమ్నుణ్ణీ, సాంబుణ్ణీ, గదుణ్ణీ, కృతవర్మనూ, ఇతర ప్రముఖ యాదవులనూ తెచ్చారు. చిత్రాంగదనూ, ఉలూచినీ వెంట బెట్టుకుని బభ్రువాహనుడు వచ్చాడు.

అశ్వమేధయాగం చాలా వైభవంగా జరిగింది. ధర్మరాజు వచ్చిన వారి కందరికీ గొప్పగా దానాలు చేశాడు. అందరూ యజ్ఞాన్ని మెచ్చుకుని, ధర్మరాజు చేసిన దానాలను కీర్తిస్తున్నారు. ఆ సమయంలో ఒక ముంగిస అక్కడికి వచ్చి, "మీరంతా ఈ యజ్ఞాన్ని మెచ్చుకుంటున్నారు గాని, ఉంఛవృత్తితో జీవిస్తూ కురుక్షేత్రంలో నివసించిన ఒక ముని చేసిన పేలపిండి దానం ఇంతకన్న ఎంతో గొప్పది," అన్నది.

ముంగిస అన్న ఈ మాటలకు అందరూ ఆశ్చర్యపోయి, "నువు ఎవరు? ఎక్కడి నుంచి వస్తున్నావు? ఇంత శాస్త్రోక్తంగా జరిగిన యాగంలో నువు ఏం వంక కని పెట్టావు? నిజం చెప్పు," అని అడిగారు.





# పుత్రభేదం

## 11

రాజకుమార్తె అడిగిన దానికి విష్ణు రూపంలో వున్న సాలెవాడు, "ఓ, సుదర్శనా! నేను నీ కోసమే వచ్చాను. నన్ను కౌగలించుకో," అన్నాడు.

"స్వామీ, మీరు దేవతలు. నేను మనుష్య స్త్రీని. మనకు పొత్తు ఎలా కుదురుతుంది?" అని సుదర్శన అన్నది.

"ప్రియా, నువు నా అర్థాంగి అయిన లక్ష్మివి. నీకు గుర్తు లేదా? శాపవశాన నువు మనుష్యజన్మ ఎత్తటమూ, మనకు కొద్దికాలం ఎడబాటు కలగటమూ జరిగింది. నేను మానవ రూపంలో కొంత కాలం నీకు భర్తగా ఉన్నమీదట శాపం తీరిపోతుంది. నిన్ను మనుష్య భర్త నుంచి కాపాడటానికి వచ్చాను. మనం గాంధర్వ వివాహం చేసుకుందాం." అన్నాడు సాలెవాడు.

రాజకుమార్తె పరమానందం చెంది, అతనికి భార్య కావటానికి ఒప్పుకున్నది.

ఇలా చాలా రోజులు వారికి సుఖంగా గడిచాయి. అర్ధరాత్రి సమయాన సాలెవాడు తన గరుడవాహనం మీద రాజకుమార్తె వద్దకు వచ్చి, తెల్లవారబోయే ముందు ఎవరికంటా పడకుండా తిరిగి వెళ్ళిపోతూ ఉండే వాడు. వెళ్ళే ముందు వాడు రాజకుమార్తెతో తాను వైకుంఠానికి పోతున్నాననీ, మళ్ళీ రాత్రికి వస్తాననీ చెప్పేవాడు.

కొంత కాలం గడిచినాక రాజకుమార్తె చెలికత్తెలు రాజకుమార్తె వద్దకు ఎవరో వచ్చిపోతున్నారని పసికట్టి, రాజుగారు తమ అశ్రద్ధ తెలిసి దండిస్తాడని భయపడి, రాజు వద్దకు వెళ్ళి, ఆయన కాళ్ళ మీద పడి, "మహారాజా, మాకు అభయం



ఇయ్యండి. మేము తమరికి ఒక సంగతి మనవి చెయ్యాలి,'' అన్నారు.

''అలాగే ఇచ్చాను. మీరు చెప్పేది చెప్పండి,'' అన్నాడు రాజు.

''మహారాజా, మేము రాజకుమార్తె సుదర్శనను వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉన్నప్పటికీ ఎవడో ఆమె వద్దకు వచ్చి పోతున్నాడు. వాడు ఎలా వస్తున్నాడో, ఎలా పోతున్నాడో మాకు తెలియటంలేదు. వాడు మెట్లెక్కి రాజకుమార్తె గదికి పోవటంలేదు; అలా చేస్తే మాకు తెలుస్తుంది. వాడు ద్వారం కుండానూ రావటం లేదు; అక్కడ కాపలావాళ్ళు ఉన్నారు. మేము రాత్రి పది గంటల దాకా రాజకుమార్తె వెంటనే ఉండి, ఆమెను పడుకోనిచ్చి వచ్చేస్తాం. తిరిగి తెల్లవారు ఝామున అయిదు గంటలకు ఆమె వద్దకు పోతాం. ఈ మధ్యకాలంలో ఆమె పిలిస్తే తప్ప ఆమె శయన మందిరంలోకి వెళ్ళం. ఆ వచ్చేవాడు ఆ సమయంలోనే వస్తూ ఉండాలి. ఎలా వస్తాడో, ఎలాపోతాడో ఊహించ రాకుండా ఉన్నది. ఇది నిజం. ఆ పైన దేవరవారి చిత్తం,'' అన్నారు రాజకుమార్తె చెలికత్తెలు.

ఈ సంగతి విని రాజు చాలా చింతించాడు. గొప్ప వంశంలో పుట్టి కూడా తన కుమార్తె నీచమైన దారి తొక్కింది. ఇందులో తన అశ్రద్ధ ఏమీ లేదు. ఆడపిల్లను కన్నవారికి అన్నీ అగచాట్లే గద! ఇలా అనుకుంటూ రాజు తన భార్య వద్దకు వెళ్ళి, తాను విన్నదంతా చెప్పి, ''ఎవడో దుర్మార్గుడికి అయుపు తీరిపోతున్నది,'' అన్నాడు.

రాణి లబ లబ లాడుతూ తన కుమార్తె మందిరానికి వెళ్ళి, ''వంశం చెడబుట్టిన నిర్భాగ్యురాలా, నీ శీలం చెడగొట్టుకున్నావా? నీ వద్దకు వచ్చే అల్పాయుష్కుడు ఎవడు?'' అన్నది.

రాజకుమార్తె సిగ్గుతో తల వంచుకుని తల్లికి, నారాయణ గరుడవాహనం మీద తన కోసం వచ్చిపోతున్న వార్త తెలిపింది.

ఈ అద్భుత కథ విని రాణికి అమిత మైన ఆనందం కలిగింది. ఆమె గగుర్పాటు చెందుతూ తన భర్త వద్దకు పోయి, "మీరు ధన్యులు! మన కుల దేవత అయిన నారాయణమూర్తి ప్రతి రాత్రి మన అమ్మాయి కోసం వస్తున్నాడట. అది లక్ష్మి అవతారమట! వాళ్ళిద్దరికీ గాంధర్వ వివాహం జరిగింది. ఇవాళ రాత్రి మనం కిటికీ కుండా నారాయణ మూర్తివారి దర్శనం చేసుకుందాం. ఆ దేవుడు మనలాటి మానవ మాత్రులను పలకరించడను కోండి!" అన్నది.

రాజుకు కూడా అపారమైన ఆనందం కలిగింది. ఆ పగలు ఆయన అతి కష్టం మీద గడిపాడు. రాత్రి అయింది. రాజూ, రాణీ కిటికీ వద్ద చేరి, ఆత్రంగా ఆకాశం కేసి చూడసాగారు. శంఖుచక్ర గదా పద్మాలు ధరించి సాలెవాడు గరుడ వాహనం మీద రావటం వారి కంట పడింది. ఆనందపారవశ్యంలో రాజు రాణితో, "ప్రపంచంలో మనే కంటె ధన్యులు లేరు! లక్ష్మినే మనం గర్భ వాసాన కన్నాం. సాక్షాత్తూ నారాయణ మూర్తే మనకు అల్లుడయాడు! మన కలలు పండాయి. మన అల్లుడి ప్రతాపంతో నేను ప్రపంచమంతా జయిస్తాను," అన్నాడు.



ఇది జరిగిన కొంత కాలానికి విక్రమసేన చక్రవర్తి మనుషులు సుప్రతివర్మ నుంచి కప్పం తీసుకు పోవటానికి వచ్చారు. ఇప్పుడు శ్రీమన్నారాయణ మూర్తివారి మామగారు కావటం చేత సుప్రతివర్మ చక్రవర్తి దూతలకు మామూలు మర్యాదలు చెయ్యలేదు. వాళ్ళు ఆగ్రహించి, "రాజా, కప్పం కట్టే గడువు దాటిపోయినా, నువు ఇంకా కట్ట లేదు. విక్రమసేన మహారాజు ఆగ్రహం కార్చిచ్చులాటిది. ఏ దేవుడో నిన్ను ఆదుకుంటాడనుకుంటున్నావా?" అన్నారు.

రాజు వాళ్ళ బెదిరింపును ఏమాత్రమూ లక్ష్యపెట్టలేదు. వాళ్ళు చక్రవర్తి వద్దకు

తిరిగి వెళ్ళి, తమకు జరిగిన అవమా నాన్ని వెయ్యింతలుగా చేసి చెప్పారు. విక్రమసేనమహారాజు తన సామంతులం దరినీ వెంట బెట్టుకుని, పెద్ద సేనతో సుప్రతివర్మ ఏలే దేశం మీదికి ఎత్తి వచ్చాడు. అతను జనహింస ప్రారంభించే సరికి, బాధితులైన ప్రజలు పుండ్రవర్ధ నానికి వచ్చి, రాజభవనం ముందు ఆక్రో శించారు. అయినా రాజు చలించలేదు.

త్వరలోనే విక్రమసేనుడు పుండ్రవర్ధ నానికి వచ్చి, నగరాన్ని ముట్టడించాడు. మంత్రులూ, పురోహితులూ, నగర ముఖ్యులూ రాజు వద్దకు వచ్చి, తాత్సారం దేనికి అని అడిగారు.

రాజు చిరునవ్వుతో, "విచారించకండి. శత్రువును నిర్మూలించే మార్గం నాకు తెలుసు. రేపు ఉదయానికల్లా ఈ పని జరగటం మీరే చూస్తారు," అన్నాడు.

అయన తన కుమార్తె సుదర్శనను పిలిపించి, ఆమెతో మధురంగానూ, గౌర వంగానూ, "అమ్మా, నీ భర్త బలం చూసుకుని నేను శత్రువుతో యుద్ధం తెచ్చుకున్నాను. అందుచేత, ఈ రాత్రి వారు నీ వద్దకు వచ్చినప్పుడు, తెల్లవారే సరికల్లా శత్రు నాశనం జరిగేలాగు చూడు," అన్నాడు.

సాలెవాడు ఆ రాత్రి తన వద్దకు వచ్చి నప్పుడు రాజకుమార్తె అతనితో సంగతి అంతా చెప్పింది.

వాడు చిరునవ్వు నవ్వుతూ, "ప్రియా, హిరణ్యకశిపుణ్ణీ, కంసుణ్ణీ, మధుకైట భులనూ చంపిన నాకు మానవమాత్రు లను చంపటమనగా ఎంత? నా చక్రా యుధంతో శత్రువులను నిర్మూలిస్తానని నీ తండ్రికి చెప్పు," అన్నాడు.

సుదర్శన గర్వంతో ఈ మాట తన తండ్రికి చెప్పింది. ఆయన పరమానందం చెందాడు. మర్నాడు ఉదయానికల్లా విక్రమసేనుడు వధించబడతాడనీ, ఆయన సొత్తు ఎవరికి దొరికినది వారు ఉంచుకో వచ్చుననీ రాజు నగరంలో చాటింపు వేయించాడు. ప్రజలు హర్షించారు.



# 149. కొలోన్ కెథీడ్రల్

సేంట్ పీటర్‌కు అంకితమైన ఈ కెథీడ్రల్ జర్మనీలోని కొలోన్ నగరంలో ఉన్నది. గోథిక్ శిల్పానికి ఉత్కృష్ట నిదర్శనంగా దీనికి ప్రపంచ ఖ్యాతి ఉన్నది. దీని శంకుస్థాపన 1248 లో జరిగినప్పటికీ, నిర్మాణం 1880 దాకా పూర్తి కాలేదు. దీని జంట శిఖరాల ఎత్తు 500 అడుగులు మించి ఉన్నది.



Photo by S. G. Seshagiry



బహుమతి
పొందిన వ్యాఖ్య

నారు పోసిన వాడు

పంపినవారు :
యస్. నజీర్‌బాష

Photo by S. G. Seshagiry



పొరుమామిళ్ళ,
(కడప జిల్లా.)

వాడు పోసిన నీరు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు మే 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూలై నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
ప్రాచీన శిల్పం

మూడవ అట్ట:
ఆధునిక శిల్పం


**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3. Arcot Road, Madras-600026. Controlling Editor : 'CHAKRAPANI'**

*Photo by:* CHANDRAKANT KHATA



MODERN STRUCTURE

